# నీతిశాస్త్రము



టీకాతాత్పర్యసహితము.

శ్రీ మహాభారత, మనుస్మృతి, భర్తృహరి మొదలగు
గ్రంథముల యందలి నీతి శ్లోకములు.

లక్ష్మీవిలాసకంపెనీ
పబ్లిషర్సు & బుక్కుసెల్లర్సు.
ఏలూరు.

మంజువాణీ ముద్రాక్షరశాల, ఏలూరు.

1919

న నీతిశాస్త్రమును చెప్పుచున్నాను, అని గ్రంథకర్త ప్రతిజ్ఞ చేయుచున్నాడు.

ధర్మఉవాచ=ధర్మరాజుపలికెను.

శ్లో॥ సత్యమ్మాతాపితాజ్ఞానం ధర్మోభ్రాతాదయాసఖా।
శాన్తిఃపత్నీక్షమాపుత్రఃషడైతేమమబాన్ధవాః॥

టీ॥ సత్యం=సత్యము; మాతా=తల్లి; జ్ఞానం=తెలివి; పితా=తండ్రి ధర్మః=ధర్మము; భ్రాతా=సోదరుడు; దయా=కరుణ; సఖా=స్నేహితుఁడు; శాంతిః=శాంతి; పత్నీ=భార్య; క్షమా=ఓర్పు; పుత్రః=కొడుకు; ఏతే=ఈ; షట్=ఆరుగురును; మమ=నాకు; బాంధవాః=బంధుగులు,

తా॥ సత్యము తల్లి, జ్ఞానము తండ్రి, ధర్మము సహోదరుఁడు, దయ స్నేహితుఁడు, శాంతి భార్య, ఓర్పు కొడుకు, ఈయారుగురును నాకు బందుగులు.

భీముఉవాచ=భీముడుపలికెను.

శ్లో॥ ప్రాణంవాపిపరిత్యజ్య మానమే వాభిరక్షతు।
అనిత్యోభవతిప్రాణో మానఆచంద్రతారకమ్॥

టీ॥ ప్రాణంవాపి=ప్రాణమైనను; పరిత్యజ్య=విడిచి; మానమేవ=మానమునే; అభిరక్షతు=రక్షించుకొనవలయును; ప్రాణః=ప్రాణము; అనిత్యః=శాశ్వతము కానిదిగా; భవతి=అగుచున్నది; మానః=మానము; ఆచంద్రతారకం=చంద్రుఁడు నక్షత్రములు ఉండుపర్యంతము; భవతి=ఉండును.

తా॥ మానహానికరమైన యాపదవచ్చినప్పుడు ప్రాణమైనను విడిచి మానము రక్షింపవలెను. ఏలయన ప్రాణము శాశ్వతమైనదికాదు క్షణభంగురము. మానము చంద్రుఁడు నక్షత్రములుండువఱకును ఉండును.

అర్జునఉవాచ= అర్జునుడుపలికెను.

శ్లో॥ ఆమంత్రణోత్సవావిప్రాగావోనవతృణోత్సవాః।
భర్తాగ్నిమోత్సవానార్యస్సోహంకృష్ణ! రణోత్సవః॥

టీ॥ విప్రాః=బ్రాహ్మణులు; ఆమంత్రణ=పిలుపు (పారిగింటి భోజన

పు పిలుపు) నందు; ఉత్సవాః=సంతోషముగలవారు; గావః=గోవులు నవ=క్రొత్తయైన; తృణ=గడ్డియందు; ఉత్సవాః=వేడుకగలవి; నార్యః=స్త్రీలు; భర్తృ=పెనిమిటియొక్క; ఆగమ=వచ్చుటయందు; ఉత్సవాః=వేడుకగలవారు; సః=ఆ; అహం=నేను ;కృష్ణ=ఓకృష్ణుఁడా; రణోత్సవః=యుద్ధమందువేడ్కగలవాఁడను.

తా॥ ఓకృష్ణుఁడా! బ్రాహ్మణులు పొరుగింటి భోజనమందాసక్తిగలవారు. గోవులు పచ్చగడ్డియందాసక్తిగలవి. స్త్రీలు తమ పెనిమిటి రాకయందాసక్తిగలవారు. నేను యుద్ధమందాసక్తిగలవాఁడను.

నకులఉవాచ=నకులుఁడుపలికెను.

శ్లో॥ మాతృవత్పరదారాంశ్చపరద్రవ్యాణిలోష్టవత్।
ఆత్మవత్సర్వభూతానియఃపశ్యతిసపశ్యతి॥

టీ॥ యః=ఎవఁడు; పరదారాన్=ఇతరుల భార్యలను; మాతృవత్=తల్లివలెను; పరద్రవ్యాణి=ఇతరుల ద్రవ్యములను; లోష్టవత్=మంటిపెళ్లవలెను: సర్వభూతాని=సమస్తమైన ప్రాణులను; ఆత్మవత్=తనవలెను న్ను; పశ్యతి=చూచునో; స= వాఁడు, పశ్యతి=బ్రహ్మనుఁగాంచును.

తా॥ ఇతరస్త్రీలను తల్లివలెను ఇతరద్రవ్యములనుమంటిపెళ్లవలెను సమస్తజీవకోటిని తనవలెను ఎవఁడు చూచునో యాతఁడే బ్రహ్మమును గనుగొనును అనఁగా ఆతఁడే బ్రహ్మజ్ఞాని యనఁబడును.

సహదేవ ఉవాచ=సహదేవుఁడు పలికెను.

శ్లో॥ అనిత్యానిశరీరాణి విభవోనైవశాశ్వతః।
నిత్యంసన్నిహితోమృత్యుఃకర్తవ్యోధర్మసంగ్రహః॥

టీ॥ శరీరాణి=శరీరములు; అనిత్యాని=నిత్యములుకావు విభవః=సంపత్తు; శాశ్వతః=స్థిరమైనదిగా; నైవ=కానేకాదు; మృత్యుః=మృత్యుదేవత నిత్యం=ఎల్లపుడును; సన్నిహితః=సమీపించియున్నది; ధర్మసంగ్రహః=ధర్మముయొక్క గ్రహణము; కర్తవ్యః=చేయవలెను.

తా॥ శరీరములు నిత్యములుకావు సంపత్తు శాశ్వతముకాదు మృత్యువెప్పుడు కాచుకొనియేయున్నది. కాబట్టి ధర్మమును చేయవలెను.

ద్రౌపద్యువాచ=ద్రౌపదిపలికెను.

శ్లో॥ సుందరంపురుషందృష్ట్వాభ్రాతరం పితరంసుతం।
మోహస్సంజాయతేస్త్రీణాం తథ్యంమేబ్రూహికేశవ॥

టీ॥ కేశవ!=ఓకృష్ణమూర్తి! భ్రాతరం=సోదరునిగాని; పితరం=తండ్రినిగాని; సుతం=కుమారునిగాని; సుందరం=అందమైన; పురుషం=మనుష్యుని దృష్ట్వా=చూచి; (చూచినయెడల యని లక్షణచెప్పవలెనవలయును.) స్త్రీణాం=స్త్రీలకు; మోహః=మోహము; సంజాయతే=కలుగుచున్నది, తథ్యం=దీనితత్వమును; మే=నాకు; బ్రూహి=తెలుపుము.

తా॥ ఓకృష్ణమూర్తి! సోదరునిగాని తండ్రినిగాని కొడుకునుగాని సుందరుఁడైనపురుషునిగాని చూచినయెడల స్త్రీలకుమోహముకలుగును. దీనితత్వమును నాకుతెల్పుము.

శ్లో॥ పంచమేపతయస్సంతి మహ్యంషష్ఠోపిరోచతే।
పురుషాణామభావేన సర్వానార్యఃపతివ్రతాః॥

టీ॥ మే=నాకు; పంచ=అయిదుగురు; పతయః=భర్తలు; సంతి=కలరు; మహ్యం=నాకొఱకు; (నాకు) షష్ఠఃఅపి=ఆఱవవాఁడును; రోచతే=ప్రియుఁడగుచున్నాఁడు; పురుషాణాం=పురుషులయొక్క; అభావేన=సమావేశములేకపోవుటచేత; సర్వాః=అందఱు; నార్యః=స్త్రీలును; పతివ్రతాః=పతివ్రతలు.

తా॥ నాకైదుగురు భర్తలుగలరు ఆఱవవాని యందు నాకిష్టమున్నది లోకములో స్త్రీలకు పురుషులు సంకోచింప కుండుటచేత సమస్తస్త్రీలును పతివ్రతలగుచున్నారు,

శ్రీకృష్ణ ఉవాచ=శ్రీకృష్ణమూర్తి పలికెను.

శ్లో॥ ఔదుంబరాణిపుష్పాణి శ్వేతవర్ణంచవాయసం।
మత్స్యపాదంజలేపశ్యేన్ననారీహృదయస్థితం॥

టీ॥ ఔదుంబరాణి=మేడిచెట్టున; పుష్పాణి=పూవులను శ్వేతవర్ణం=తెల్లని రంగుగల; వాయసం=కాకినిన్ని; జలే=ఉదకమందు; మత్స్యపాదం=చేపకాళ్ళున్ను; పశ్యేత్=చూడవచ్చును; నారీ=స్త్రీలయొక్క హృదయే=మనస్సునందు; స్థితం=ఉన్నదానిని; నపశ్యేత్=చూడలేదు.

తా॥ మేడిపువ్వులనైనను తెల్లకాకినైనను నీళ్ళలో చేపలకాళ్లనైనను చూడవచ్చును (ఇవన్నియుదుర్లభమైనవి.) కాని స్త్రీలహృదయములో నున్న విషయము తెలియరాదు.

శ్రీకృష్ణ ఉవాచ=కృష్ణమూర్తి పలికెను.

శ్లో॥ దుర్భిక్షేచాన్నదాతారం సుభిక్షేచ హిరణ్యదమ్॥
చతురోహంతునంస్యామి రణేధీర మృణేశుచిమ్॥

దుర్భిక్షే=కఱవుకాలమందు; అన్నదాతారం=అన్నదానము చేయువానిని సుభిక్షే=పాడిపంటగల కాలమందు హిరణ్యదం=ధనమిచ్చు వానిని; రణే=యుద్ధమందు; ధీరం=ధైర్యముగలవానినిన్ని; ఋణే=అప్పునందు శుచిం=శుచిగలవానినిన్ని; చతురః= ఈనల్గురిని; అహంతు=నేను; నంస్యామి=నమస్కరించుచున్నాను.

తా॥ కఱవుకాలములో నన్నదానము చేయువానికిని పాడిపంటలుగల కాలములో ధనము దానము చేయువానికిని యుద్ధమందు పిఱికితనములేక ధైర్యముతో నిలువఁబడువానికిని అప్పులేనివానికిని నమస్కరింతును.

కర్ణ ఉవాచ=కర్ణుఁడు పలికెను.

శ్లో॥ విప్రహస్తేధనందద్యాత్స్వభార్యాయాంచయౌవనం।
స్వామికార్యేషుచప్రాణం నిశ్చయోమమమాధవ॥

టీ॥ మాధవ!=ఓకృష్ణమూర్తీ! ధనం=ద్రవ్యమును; విప్రహస్తే=బ్రాహ్మణునిచేతియందు; దద్యాత్=వినియోగపఱుపవలెను; యౌవనం=తనయొక్క జవ్వనమును; స్వభార్యాయాం=తనభార్యయందే; దద్యాత్=వినియోగపఱుపవలెను; ప్రాణం= తనప్రాణమును; స్వామి కార్యేషు=తనప్రభువుయొక్క కార్యములందు దద్యాత్=వినియోగపఱుపవలెను; (ఇతి=అని) మమ=నాయొక్క; నిశ్చయః=నిశ్చయము.

తా॥ ఓకృష్ణమూర్తీ! తానార్జించినద్రవ్యము బ్రాహ్మణునికి వినియోగపఱుపవలెను. తనయౌవనము తనభార్యయందు వినియోగించవలెను. తనయొక్క ప్రాణము తనయేలికయొక్క పనులయందు వినియోగపఱుపవలయు నని నానిశ్చయము.

శ్లో॥ సర్వస్యగాత్రస్యశిరఃప్రధానంసర్వేంద్రియాణాం
నయనంప్రధానం। షణ్ణాంరసానాంలవణంప్రధానంభవే
న్నదీనాముదకంప్రధానం॥

టీ॥ సర్వస్య=సమస్తమైన; గాత్రస్య=శరీరమునకు; శిరః=తల; ప్రధానం=ముఖ్యమైనది; భవేత్=అగును; సర్వ=సమస్తమైన; ఇంద్రియాణాం=ఇంద్రియములలోను; నయనం=కన్ను; ప్రధానం=ప్రధానము; భవేత్=అగును; షణ్ణాం=ఆఱు; రసానాం=రసములలో; లవణం=ఉప్పు; ప్రధానం=ముఖ్యమైనది; భవేత్=అగును; నదీనాం=నదులలో; ఉదకం=నీరు ప్రధానం=ముఖ్యమైనది; భవేత్=అగును

తా॥ శరీరమునకంతకును శిరస్సు ప్రధానము ఇంద్రియములన్నింటికి నేత్రము ప్రధానము రసములారింటిలో ఉప్పు ప్రధానము నదులన్నింటిలో నీరు ప్రధానము.

శ్లో॥ మృత్పిండఏకోబహుభాండరూపస్సువర్ణమేకంబహుభూష
ణాని। గోక్షీరమేకంబహుధేనుజాతిమేకఃపరాత్మాబహు
దేహవర్తీ॥

టీ॥ బహు.. రూప; బహు=అనేకమైన; భాండ=కుండల యొక్క రూపః=రూపమైన; మృత్పిండః=మంటిముద్ద; ఏకః=ఒక్కటియే; సువర్ణం=బంగారము; ఏకం=ఒక్కటియే; బహుభూషణాని=అనేకములగు అలంకారములు; గోక్షీరం=ఆవుపాలు; ఏకం=ఒక్కటియే; బహుధేనుజాతం=అనేకమైన ఆవులవలన కలిగినది; పరాత్మా=పరమాత్మ; ఏకః=ఒక్కడే; బహుదేహవర్తీ=అనేకదేహములందున్నాడు.

తా॥ కుండలు వేరు వేరుగనున్నప్పటికి మన్ను ఒక్కటియే. భూషణములు వేర్వేరైనప్పటికి బంగారమొక్కటియే ఆవులు వేర్వేరైనప్పటికి పాలొక్కటియే అట్లే శరీరములు వేర్వేరైనప్పటికి పరమాత్మ యొక్కటియే.

శ్లో॥ అర్థాతురాణాంనగురుర్నబంధుః కామాతురాణాంనభయం నలజ్జా। విద్యాతురాణాంనసుఖంననిద్రాక్షుధాతురాణాం నరుచిర్నపక్వం॥

టీ॥ అర్థాతురాణాం = ధనమందు మిక్కిలి కోర్కెగల వారికి. గురుః = గురువు; న = లేదు; బంధుః = బందుగు; న = లేదు, కామాతురాణాం = కామమను రోగముగల వారలకు; భయం = భయము న = లేదు; లజ్జా = సిగ్గు; న = లేదు; విద్యాతురాణాం = విద్యయను రోగముగల వారలకు; సుఖం = సౌఖ్యము; న = లేదు; నిద్రా = నిదుర; న = లేదు; క్షుధాతురాణాం = ఆకలియను రోగముగలవారలకు; రుచిః = రుచి; న = అక్కరలేదు.

ద్రవ్యాశ గలవారలకు గురువులు బంధువులు లేరు కాముకులకు భయము సిగ్గు లేదు. విద్యయందభిలాష గలవారలకు సౌఖ్యము నిద్దర మొదలగునవి లేవు. ఆఁకొన్నవారలకు రుచియక్కరలేదు.

శ్లో॥ దాతాదరిద్రఃకృపణోధనాఢ్యఃపాపీచిరాయుస్సుకృతీగతాయుః।రాజాకులీనస్సుకులేనసేవ్యఃకలౌయుగేషడ్గుణమాశ్రయంతి॥

టీ॥ దాతా = దానముచేయువాఁడు; దరిద్రః = దరిద్రుఁడౌట; కృపణః = లోభి; ధనాఢ్యః = ధనవంతుఁడౌట; పాపీ = పాపి; చిరాయుః = చాలకాలము జీవించువాఁడగుట; సుకృతీ = పుణ్యపురుషుఁడు; గతాయుః = మృతుఁడగుట; అకులీనః = దుష్కుల ప్రసూతుఁడు; రాజా = రాజై; సుకులేన = మంచికులము గలవానిచే; సేవ్యః = సేవింపఁదగినవాఁడగుట; షడ్గుణం = ఈ యాఱుగుణములను; కలౌయుగే = కలియుగమందు ఆశ్రయంతి = ఆశ్రయించుచున్నారు.

తా॥ దాత, దరిద్రుఁడగుట లోభి ధనవంతుఁడగుట పాపి చాలకాలము బ్రతుకుట పుణ్యవంతుఁడు అల్పాయువగుట అకులీనుఁడు రాజగుట సుకులుఁడు సేవకుఁడగుట యను నీయాఱుగుణములను కలియుగమందు పొందుచున్నారు.

శ్లో॥ భార్యావియోగస్సుజనాపవాదఃఋణస్య శేషఃకుజనస్యసేవా।
దారిద్ర్యకాలేప్రియదర్శనంచవినాగ్నినాపంచదహంతికాయం॥

టీ॥ భార్యా=పెండ్లాముయొక్క; వియోగం=ఎడఁబాటున్ను; సుజన=సత్పురుషులయొక్క; అపవాదః=నింద; ఋణస్య=అప్పుయొక్క; శేషః=మిగుల్చుట; కుజనస్య=దుర్జనునియొక్క; సేవా=పరిచర్య; దారిద్ర్యకాలే=పేదఱికపుటదనున; ప్రియదర్శనంచ= చుట్టములను చూచుట; పంచ=ఈయైదును; అగ్నినావినా=నిప్పులేకయే; కాయం=ఈశరీరమును; దహింతి_కా

తా॥ భార్యావియోగము సజ్జనుల నిందించుట ఋణశేషము దుర్జనుఁ జేయుసేవ పేదఱికమున చుట్టములఁజూచుట అను నీయైదును నిప్పులేకయే శరీరమును కాల్చును.

శ్లో॥ పుస్తకంవనితావిత్తం పరహస్తగతంగతః। అథవా
పునరాయాతింజీర్ణంభ్రష్టాచఖండశః॥

టీ॥ పర= ఇతరునియొక్క; హస్త= చేతిని; గతం= పొందిన; పుస్తకం= పుస్తకము వనితా= స్త్రీ; విత్తం= ధనము; గతం= పోయినదియే; అథవా= కానియెడల; జీర్ణం= చినిఁగిపోయినదై; భ్రష్టా= చెడిపోయినదై; ఖండశః= కొంచమైనదై పునరాయాతి= తిరిగివచ్చును

తా॥ పుస్తకము, వనిత, ధనము, ఇతరుని చేతిలోఁబడిన యెడల నది పోయినదానితో సమానమే ఒకవేళవచ్చినను పుస్తకము చినిఁగిపోయి వచ్చును. స్త్రీ చెడిపోయినదై వచ్చును. ధనము కొంచెముగా వచ్చును.

శ్లో॥ ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం మంత్రౌషధ సమాగమాః।
దానమానావమానాశ్చనవగోప్యాఃమనీషిభిః॥

టీ॥ ఆయుః= ఆయువు; విత్తం= ధనము; గృహచ్ఛిద్రం= ఇంటిగుట్టు; మంత్ర= మంత్రము; ఔషధము= మందు; సమాగమాః= సంగమములు; దాన= దానము; మాన= మానము; అవమానాంశ్చ= అవమానములు; మనీషిభిః=పండితులచే; నవ=ఈతొమ్మిదియును; గోప్యాః=దాచదగినవి.

తా॥ ఆయువు, ధనము, ఇంటిగుట్టు, మంత్రము, ఔషధము, సంగమము, దానము, మానము, అవమానము, వీనిని పండితులగు వారు గుప్తముగా నుంచవలెను.

శ్లో॥ ఋణానుబంధరూపేణ పశుపత్నీసుతాలయాః। ఋణక్షయేక్షయంయాంతి కాతత్రపరివేదనా॥

టీ॥ పశు - పశువు; పత్నీ = భార్య; సుత = కుమారులు; ఆలయాః = ఇండ్లును; (ఇవి) ఋణ = ఋణముయొక్క; అనుబంధరూపేణ = సంబంధద్వారా; (భవంతి) (కలుగుచున్నవి.) ఋణక్షయే = అప్పుతీరగా; క్షయం = నాశనమును; యాంతి = పొందుచున్నవి; తత్ర = ఆ పశువులు మొదలగువాని విషయమై; పరివేదనా = విచారము కా = ఏమి.

తా॥ సకలజనులకును పశువులు పెండ్లాము కొమాళ్లు ఇండ్లును జన్మాంతర ఋణసంబంధముచేత కలుగుచున్నవి. ఋణముతీరఁగానే నాశముపొందుచున్నవి. కాబట్టి యీవిషయమై వేదనయేల.

శ్లో॥ దూషకశ్చక్రియాహీనో నికృష్టోదీర్ఘకోపనః। చత్వారః కర్మచండాలా జాతిచండాల ఉత్తమః॥

టీ॥ దూషకః = పరులను దూషించువాఁడు; క్రియాహీనః = చేయఁదగిన కర్మలను చేయనివాఁడు; నికృష్టః = లోభి; దీర్ఘకోపనః = దీర్ఘకోపము గలవాఁడు; చత్వారః = నలుగురును; కర్మచాండాలాః = కర్మచేత చాండాలులు; జాతిచాండాలః = జాతిచేత చాండాలుఁడైనవాఁడు; ఉత్తమః = ఉత్తముఁడు

తా॥ పరులను దూషించువాఁడు, చేయఁదగిన కర్మలను విడిచిపెట్టినవాఁడు లోభి, చిరకాలముకోపముగలవాఁడు, వీరునలువురు కర్మచండాలురు వీరికంటె జాతిచేత చండాలుఁడైనవాఁడుత్తముఁడు.

శ్లో॥ రాజవత్పంచవర్షాణి దశవర్షాణి దాసవత్। ప్రాప్తేతుషోడశేవర్షే పుత్రంమిత్రవదాచరేత్॥

పుత్రం = కుమారుని; పంచవర్షాణి = ఐదేండ్లు; (పర్యంతము) రాజవత్ = రాజువలెను; దశవర్షాణి = పదేండ్లు(పర్యంతము)దాసవత్ = దాసునివలెను;

షోడశే = పదునాఱవదియగు; వర్షే = సంవత్సరము; ప్రాప్తేతు = ప్రాపించఁగా మిత్రవత్ = స్నేహితునివలెను; ఆచరేత్ = కనుగొనవలెను.

తా॥ కొడుకును, ఐదేడ్లంవఱకును రాజువలెను, పదేండ్లవఱకు దాసునివలెను పదునారవయేడు ప్రాప్తించిన మొదలు స్నేహితునివలెను చూడవలెను.

శ్లో॥ బాలార్కః ప్రేతధూమశ్చ వృద్ధస్త్రీపల్వలోదకం।
రాత్రౌదధ్యన్నభుక్తిశ్చ ఆయుఃక్షీణందినేదినే॥

దీనియందంతటను లక్షణయాశ్రయింపఁబడినది.

టీ॥ బాలార్కః = లేఁత సూర్యునియెండను గాచుకొనుట; ప్రేతధూమశ్చ = పీనుగుకాలెడుపొగమీఁదఁబారుట; వృద్ధస్త్రీ = తనకంటెపెద్దదియగు స్త్రీతో సంగమించుట; పల్వలోదకం = మురిఁగి మడుగునీరు త్రావుట; రాత్రౌ = రాత్రిపూట; దధ్యన్నభుక్తిశ్చ = పెరుగన్నముతినుటయు; దినేదినే = ప్రతిదినమందును (దినదినమునకు) ఆయుః = ఆయుస్సును; క్షీణః = తక్కువైనదానినిగా; (క్రియాత్ = చేయును.)

తా॥ సూర్యోదయమునగల యెండనుగాచుకొనుట; పీనుగపైనుండి వచ్చు పొగమీఁదఁబారుట తనకంటె పెద్దస్త్రీతో సంగమించుట మురిగిననీటిగుంట నీరుఁద్రావుట ఇవి దినదినమునకు నాయుస్సునుక్షీణింపఁజేయును

శ్లో॥ వృద్ధార్కో హోమధూమశ్చ బాలస్త్రీనిర్మలోదకం।
రాత్రౌక్షీరాన్నభుక్తిశ్చ ఆయుర్వృద్ధిర్దినేదినే॥

దీనిలోగూడనంతటను లక్షణనాశ్రయించవలెను.

టీ॥ వృద్ధార్కః = వృద్ధియగుచున్నసూర్యుఁడు (అనఁగా సాయంకాలమందెండ కాచుకొనుట) హోమధూమశ్చ = హోమమువలనగలిగిన పొగమీఁదఁబారుట; బాలస్త్రీ = తనకంటె చిన్నదానితో సంగమించుట; నిర్మలోదకం = నిర్మలోదకమునుఁబానీము సేయుట; రాత్రౌ = రాత్రిపూట క్షీరాన్నశ్చ; భుక్తి = పాలుపోసుకొనియన్నముతినుటయు; దినేదినే = ప్రతిదినమందును; ఆయుర్వృద్ధిః = ఆయుస్సునభివృద్ధిచేయును.

తా॥ సాయంకాలమందెండఁగాచుకొనుట హోమధూమమువిూఁదఁ బారుట తనకంటె చిన్నదగు స్త్రీతో భోగించుట నిర్మలమైన నీటినిత్రాగుట రాత్రిపూట పాలతో నన్నముతినుట దినదినమునకు ఆయుస్సునువృద్ధిసేయును.

శ్లో॥ ఉత్తమంస్వార్జితంవిత్తం మధ్యమం పితురార్జితమ్।
అధమంభ్రాతృవిత్తంచ స్త్రీవిత్తమధమాధమమ్॥

టీ॥ స్వార్జితం = తానుసంపాదించిన; విత్తం = ధనము; ఉత్తమం = శ్రేష్ఠమైనది; పితుః = తండ్రివలన; ఆర్జితం = సంపాదింపఁబడిన; విత్తం = ధనము; మధ్యమం = సామాన్యమైనది; భ్రాతృవిత్తం = సోదరద్రవ్యము; అధమం = నీచమైనది; స్త్రీవిత్తం = స్త్రీధనము; అధమాధమం = మిక్కిలినీచమైనది.

తా॥ తానుసంపాదించు సొమ్ము ఉత్తమము తండ్రిసంపాదించినది మధ్యమము సోదరులుసంపాదించినది యధమము స్త్రీవలన వచ్చినధనము మిక్కిలి నీచము దీనికంటె నీచమైనది మరొకటిలేదు.

శ్లో॥ ఉత్తమాకులవిద్యాయా మధ్యమాకృషివాణిజాత్।
అధమాసేవయావృత్తి ర్మృత్యుశ్చౌర్యోపజీవనాత్॥

కులవిద్యాయాః = కులవిద్యలవలన; వృత్తి = జీవించియుండుట; ఉత్తమా = శ్రేష్ఠమైనది; కృషివాణిజాత్ = కృషివలనవర్తకమువలన; వృత్తిః = జీవించుచుండుట; మధ్యమా = సామాన్యమైనది; సేవయా = కొలువు కొల్చుటచేత; వృత్తిః = జీవించుచుండుట; అధమా = నీచమైనది; చౌర్యోపజీవనాత్ = దొంగతికమువలనజీవించుటకంటె; మృత్యుః = మరణము; (ఉత్తమః = (శ్రేష్ఠము)

తా॥ తనకులవిద్యవలని జీవించుట యుత్తమము కృషివలన వర్తకము వలన జీవించుట మధ్యమము సేవఁజేసి జీవించుట నీచము దొంగతనమువలనజీవించుటకంటె మరణము మేలు.

శ్లో॥ ఉత్తమేక్షణకోపస్స్యాన్మధ్యమేఘటికాద్వయమ్।
అధమేస్యాదహోరాత్రం పాపిష్ఠే మరణావధేః॥

ఉత్తమే=ఉత్తమునియందు; క్షణకోపః=క్షణకాలకోపము; స్యాత్ =ఉండును; మధ్యమే=మధ్యమునియందు; ఘటికాద్వయం = రెండుగడియలు; స్యాత్ = ఉండును; అధమే = అల్పునియందు; అహోరాత్రం = ఒకరేయింబవలు; స్యాత్ = ఉండును; పాపిష్ఠే = పాపాత్మునియందు; మరణావధేః = మరణపర్యంతము; స్యాత్ = ఉండును.

తా॥ ఉత్తమునకు కోపముక్షణకాలముండును మధ్యమునకు రెండు గడియలకాలముండును అల్పునియందు ఒకరేయింబవలుండును పాపాత్మునకు చచ్చుదాకయుండును.

శ్లో॥ ఆత్మబుద్ధిస్సుఖకరీ గురుబుద్ధిర్విశేషతః।
పరబుద్ధిర్వినాశాయ స్త్రీబుద్ధిఃప్రళయంకరీ॥

ఆత్మబుద్ధిః = తనబుద్ధి; సుఖకరీ = సుఖమును చేయును; గురుబుద్ధిః = గురువుయొక్కబుద్ధి; విశేషతః = మిక్కిలి; సుఖకరీ = సుఖముకలిగించునది; పరబుద్ధిః = ఇతరులబుద్ధి; వినాశాయ = నాశమునకు; (భవతి = అగును) స్త్రీబుద్ధిః = స్త్రీయొక్కబుద్ధి; ప్రళయంకరీ = చంపునది.

తా॥ తనబుద్ధి సుఖమునిచ్చును గురుబుద్ధి విశేషముగాసుఖమునిచ్చును పరబుద్ధి చెరుచును స్త్రీబుద్ధిచంపును.

శ్లో॥ అతిథౌతిష్ఠతిద్వారి హ్యాపోగృహ్ణాతియోనరః।
ఆపోశనంసురాపానం మన్నంగోమాంసభక్షణమ్॥

అతిథౌ = అతిథి; ద్వారి = ఇంటివాకటియందు; తిష్ఠతి(సతి) = ఉన్నవాడగు; యోనరః = ఏ; నరః = మనుష్యుడు; ఆపః = ఉదకమును అనగా ఆపోశనమును; గృహ్ణాతి = గ్రహించుచున్నాడో (వాడుచేయు) ఆపోశనం = ఆపోశనము; సురాపానం = కల్లుద్రావుటవంటిది; అన్నం = అన్నముదినుట; గోమాంసభక్షణ = ఆవుమాంసమును దినుటవంటిది.

తా॥ అతిథి వాకిట నిల్వబడియుండఁగానే మనుష్యుఁడాపోశనము చేయునో ఆయాపోశనము కల్లుదాగుటతో సమానము ఆయన్నము తినుట ఆవుమాంసమును తినుటవంటిది.

శ్లో॥ దర్శనాచ్చిత్తవైకల్యం స్పర్శనాత్తు ధనక్షయః।
సంభోగాత్కిల్బిషంపణ్యస్త్రీణాంప్రత్యక్షరక్షసామ్॥

టీ॥ ప్రత్యక్షరక్షసాం = ప్రత్యక్షరాక్షసులైన; పణ్యస్త్రీణాం = భోగమువాండ్రయొక్క; దర్శనాత్ = దర్శనమువలన; చిత్తవైకల్యం = మనోవైకల్యము; స్పర్శనాత్తు = స్పృశించుటవలననయితే; ధనక్షయం = ద్రవ్యనాశనము; సంభోగాత్ = రతివలన; కిల్బిషం = పాపము; (భవతి = కలుగుచున్నది)

తా॥ ప్రత్యక్ష రాక్షసులైన భోగమువాండ్రను చూచుటవలన మనస్సు వికలమగును వారలను స్పృశించుటవలన ద్రవ్యముపోవును వారలను సంభోగించుటవలన పాపమువచ్చును.

శ్లో॥ దాసీమానధనంహంతి హంతివేశ్యాధనాదికమ్।
ఆయూంషివిధవాహంతి సర్వంహంతిపరాంగనా॥

టీ॥ దాసీ = దాసి; (అనగా దాసిదాని సంగమము) మానధనం = మానమనేధనమును; హంతి = పోగొట్టును; వేశ్యా = భోగముది; ధనాదికం = ద్రవ్యముమొదలగువానిని; హంతి = పోగొట్టును; విధవా = విధంతువు; ఆయూంషి = ఆయువులను; హంతి = పోగొట్టును; పరాంగనా = పరస్త్రీ; సర్వం = అన్నిటిని; హంతి = పోగొట్టును.

తా॥ దాసీసంగమము మానమునుబోగొట్టును. వేశ్యాసంగమము ద్రవ్యముమొదలగువానిని నశింపజేయును. విధవాసంగమము ఆయువునుపోగొట్టును. పరస్త్రీసంభోగములన్ని గుణములను బోగొట్టును.

శ్లో॥ దుర్జనంకాంచనంభేరీందుష్టస్త్రీందుష్టవాహనమ్।
ఇక్షుఖండాంస్తిలాన్ శూద్రాన్ మర్దయేద్గుణవృద్ధయే॥

టీ॥ దుర్జనం = చెడ్డవానిని, కాంచనం = బంగారమును, భేరీం భేరిని, దుష్టస్త్రీం = చెడ్డదైనయాడుదానిని, దుష్టవాహనం = చెడ్డగుఱ్ఱమును.

ఇక్షుఖండాన్ = చెఱకుముక్కలను, తిలాన్=నువ్వులును, శూద్రాన్=శూద్రులను, గుణవృద్ధయే = గుణవృద్ధికొఱకు, మర్దయేత్ = మర్దింపవలెను.

తా॥ చెడ్డవానిని, బంగారమును, భేరిని,దుష్టస్త్రీని, చెడ్డగుఱ్ఱమును, చెఱకుముక్కలను, నువ్వులను, శూద్రులను, గుణవృద్ధికొఱకు మర్దించవలెను.

శ్లో॥ నగచ్ఛేద్రాజయుగ్మంచ నగచ్ఛేద్బ్రాహ్మణత్రయం।
చతుశ్శూద్రా నగచ్ఛేయు ర్నగచ్ఛేద్వైశ్యపంచకమ్॥

టీ॥ రాజయుగ్మం = ఇద్దఱురాజులు, నగచ్ఛేత్ = వెళ్లకూడదు, బ్రాహ్మణత్రయం = ముగ్గురుబ్రాహ్మణులు, నగచ్ఛేత్ = వెళ్లకూడదు, చతుశ్శూద్రాః = నలుగురుశూద్రులు, నగచ్ఛేయుః = వెళ్లఁగూడదు, వైశ్య పంచకం = ఐదుగురుకోమటులు, నగచ్ఛేత్ = వెళ్లగూడదు.

తా॥ ఒకానొక కార్యార్థము పోవునప్పుడిద్దఱురాజులు కలసివెళ్లకూడదు. ముగ్గురుబ్రాహ్మణులు కలసివెళ్లగూడదు. నల్గురుశూద్రులు కలసివెళ్లగూడదు. ఐదుగురు కోమటులుకలసిపోగూడదు.

శ్లో॥ ఉషశ్శశంసగార్గ్యస్తుశకునంతుబృహస్పతిః।
మనోజయంతుమాండవ్యో విప్రవాక్యోజనార్దనః॥

టీ॥ గార్గ్యస్తు = గార్గ్యమహాముని, ఉషః = ప్రాతఃకాలము (మంచిదని) శశంస = చెప్పెను, బృహస్పతిః = బృహస్పతి, శకునంతు = శకునమే, (మంచిదని) శశంస = చెప్పెను, మాండవ్యస్తు = మాండవ్య మహాముని యయితే, మనోజయం = మనస్సే జయప్రదమగునని, శశంస = చెప్పెను, జనార్దనః = కృష్ణమూర్తి, విప్రవాక్యో = బ్రాహ్మణవాక్యము, (మంచిదని) శశంస = చెప్పెను.

తా॥ ఏకార్యమునకైనను బోవుటకు నుషఃకాలము మంచిదని గార్గ్యముని చెప్పెను. శకునము చూచుకొని పోవలయునని బృహస్పతిచెప్పెను. మనస్సున నెపుడు బయలు వెడలిన కార్యము సఫలమగునని నిస్సంశయముగఁ దోచినపుడు పోవలయునని మాండవ్యుఁడు చెప్పెను. బ్రాహ్మణవాక్యము శ్రేష్ఠమని జనార్దనుఁడు పలికెను.

శ్లో॥ శర్వరీదీపకశ్చంద్రః ప్రభాతోద్దీపకోరవిః । త్రైలోక్యదీపకోధర్మ స్సుపుత్రఃకులదీపకః॥

టీ॥ చంద్రః = చంద్రుఁడు, శర్వరీదీపకః = రాత్రిని ప్రకాశింపఁజేయువాఁడు, రవిః = సూర్యుఁడు, ప్రభాతోద్దీపకః = పగఁటినిఁ బ్రకాశింపఁజేయువాఁడు, సుపుత్రః = మంచికుమారుఁడు, కులదీపకః = కులమునుఁ బ్రకాశింపఁజేయువాడు, ధర్మః = ధర్మము, త్రైలోక్యదీపకః = మూఁడు లోకములను బ్రకాశింపజేయునది.

తా॥ చంద్రుఁడు రాత్రిని బ్రకాశింప జేయును. సూర్యుఁడు పగటిని ప్రకాశింపఁ జేయును. మంచికొడుకు తన కులము నంతను బ్రకాశింపజేయును. ధర్మము మూఁడులోకములను బ్రకాశింప జేయును.

శ్లో॥ సబంధుర్యోహితేషుస్స్యాత్సపితాయస్తుపోషకః।
సఖాయత్రవిశ్వాసస్సాభార్యాయత్రనిర్వృతిః

టీ॥ యః = ఎవఁడు, హితేషుః = హితమునుగోరునో, సః = వాఁడే, బంధుః = బంధువు, యస్తు = ఎవఁడైతే, పోషకః = పోషించు వాఁడో సః (ఏవ) = వాఁడే, పితా = తండ్రి, యత్ర = ఎవనియందు. విశ్వాసః = నమ్మకము (గలదో) స (ఏవ) = వాఁడే, సఖా = స్నేహితుఁడు, యత్ర = ఎవతెయందు, నిర్వృతిః = సుఖము (గలుగునో) సా (ఏవ) = ఆపెయే భార్యా = పెండ్లాము.

తా. ఎవఁడు తనహితమును గోరునో యాతఁడే బంధువు ఎవ్వఁడు తన్ను పోషించునో యాతఁడే తండ్రి ఎవ్వనియందు తనకు నమ్మకముండునో యాతఁడే స్నేహితుఁడు ఎవ్వతె తన్ను సుఖింపఁజేయునో యాపెయే భార్య.

శ్లో॥ అర్థానామార్జనేదుఃఖమార్జితానాంచరక్షణే।
నాశేదుఃఖంవ్యయేదుఃఖంకిమర్థం దుఃఖభాజనం॥

టీ. అర్థానాం = ద్రవ్యముయొక్క; అర్జనే = గడనయందు; దుఃఖం = దుఃఖము; (భవతి = అగుచున్నది) అర్జితానాం = సంపాదించినదా

నిరొుక్కు; రక్షణే = కాపాడుటయందు; దుఃఖం = దుఃఖము; వ్యయే = ఖర్చునందు; దుఃఖం = దుఃఖము (భవతి = అగుచున్నది) దుఃఖభాజనం = దుఃఖమునుపొందించునట్టి; (ధనం = ధనము) కిమర్థం = ఏమిప్రయోజనము.

తా॥ ద్రవ్యముసంపాదించుటయందు దుఃఖము. సంపాదించిన దానిని రక్షించుటయందు దుఃఖము. దానినాశనమందు దుఃఖము. ఖర్చునందు దుఃఖము, కాబట్టి యిట్టిదుఃఖకారణమగు ద్రవ్యమెందుకు ?

శ్లో॥ హరిణాపిహరేణాపి బ్రహ్మణాపిసురైరపి।
లలాటలిఖితారేఖాపరిమార్ష్టుంనశక్యతే॥

టీ. హరిణాఽపి = విష్ణుమూర్తిచేతగాని; హరేణాఽపి = ఈశ్వరునిచేతగాని; బ్రహ్మణాఽపి = బ్రహ్మచేతగాని; సురైరపి = దేవతలందఱిచేతఁగాని; లలాటలిఖితా = నొసటవ్రాయఁబడిన; రేఖా = గీఁత(అనగా వ్రాఁత) పరిమార్ష్టుం = తుడుపుటకు; నశక్యతే = సాధ్యముకాదు.

తా॥ విష్ణుచేతఁగాని, ఈశ్వరునిచేతఁగాని, బ్రహ్మచేతఁగాని, తక్కిన దేవతలందఱిచేతఁగాని నొసటవ్రాయఁబడిన వ్రాఁతతుడుపుటకు సాధ్యముకాదు.

శ్లో॥ ఘృతేనవర్ధతేబుద్ధిః క్షీరేణాయుష్య వర్ధనమ్।
శాకేనవర్ధతేవ్యాధి ర్మాంసంమాంసేనవర్ధతే॥

టీ. బుద్ధిః = బుద్ధి; ఘృతేన = నేతిచే, వర్ధతే = పెరుగును, క్షీరేణ = పాలచే, ఆయుష్యవర్ధనం = ఆయుఃప్రమాణము పెరుఁగుట (భవతి = అగుచున్నది) శాకేన = కూరచే, వ్యాధిః = రోగము, వర్ధతే = పెరుగును, మాంసేన = మాంసముచే, మాంసం = మాంసము, వర్ధతే = పెరుగును.

తా॥ నేతినిత్రాగుటవలన బుద్ధిపెరుగును. పాలుద్రావుటవలన ఆయువు వృద్ధియగును కూరలచే రోగముపెరుగును. మాంసముతినుటచే మాంసముపెరుగును.

శ్లో॥ ఉత్సాహస్సాహసంధైర్యం బుద్ధిశ్శక్తిఃపరాక్రమః।
షడైతేయత్రతిష్ఠంతి తత్రదేవోపితిష్ఠతి॥

టీ. ఉత్సాహః = ఉత్సాహము, సాహసం = సాహసము, ధైర్యం = ధైర్యము, బుద్ధిః = బుద్ధియు, శక్తిః = శక్తి, పరాక్రమః = పరాక్రమము, ఏతే = ఈ, షట్ = ఆరున్ను, యత్ర = ఎచ్చట, తిష్ఠంతి = ఉండునో, తత్ర = అచ్చట, దేవోఽపి = దేవుఁడుకూడ, తిష్ఠతి = ఉన్నాఁడు.

తా॥ఎవనికి నుత్సాహము, సాహసము, ధైర్యము, బుద్ధి, శక్తి, పరాక్రమము ఈయారును గల వానికి దైవముకూడ సాయపడును.

శ్లో॥ అసంతుష్టోద్విజోనష్టస్సంతుష్టఇవపార్థివః।
సలజ్జాగణికానష్టా నిర్లజ్జేవకులాంగనా॥

టీ॥ సంతుష్టః = తృప్తిఁగలిగిన, పార్థివఇవ = రాజువలె అసంతుష్టః = తృప్తిలేని, ద్విజః = బ్రాహ్మణుఁడు నష్టః = నశించు వాఁడగును. నిర్లజ్జా = సిగ్గులేని, కులాంగనేవ = కుల స్త్రీవలె సలజ్జా = సిగ్గుతో నున్న గణికా = వేశ్య, నష్టా = చెడిపోవునది (యగును.)

తా॥ తృప్తిలేని బ్రాహ్మణుఁడు, తృప్తిపొందెడు రాజు, సిగ్గుగల వేశ్య, సిగ్గులేని యాడుది, చెడిపోవుదురు.

శ్లో॥ వేదమూలమిదంబ్రాహ్మణ్యంభార్యామూలమిదంగృహం
కృషిమూలమిదంధాన్యంధనమూల మిదంజగత్॥

టీ॥ ఇదం = ఈ, బ్రాహ్మణ్యం = బ్రాహ్మణత్వము, వేదమూలం = వేదముమూలముగాగలది,ఇదం = ఈ,గృహం = ఇల్లు,భార్యామూలం = భార్యయే మూలముగాగలది, ఇదం = ఈ, ధాన్యం = పంట, కృషిమూలం = కృషియే మూలముగాగలది. ఇదం = ఈ, జగత్ = ప్రపంచకము, ధనమూలం = ధనమేమూలముగాగలది.

తా॥ బ్రాహ్మణులకు వేదముమూలము, గృహమునకు భార్యమూలము ధాన్యమునకు కృషిమూలము జగత్తునకు ధనమేమూలము.

శ్లో॥ శిలాస్థగంధలేపశ్చ మార్జాలోచ్ఛిష్టభోజనం। ప్రతి
బింబేక్షణం నీరే శక్రస్యాపి శ్రియంహరేత్॥

టీ॥ శిలాస్థ= రాతి (సాన) యందున్న గంధలేపః= గంధము పూసికొనుట, మార్జాల= పిల్లియొక్క, ఉచ్ఛిష్టభోజనం= ఎంగిలినితినుట నీరే= నీటియందు, ప్రతిబింబేక్షణం= (తనయొక్క) ప్రతిబింబమును చూచుట (ఇవి) శక్రస్య- ఇంద్రునియొక్క, శ్రియమపి= సంపత్తును గూడ, హరేత్ = హరించును.

తా॥ సానపైని గంధము పూసికొనుట పిల్లి తిన్నయెంగిలిని దినుట నీటిలో తన ప్రతిబింబమును చూచుకొనుట అనునివి ఇంద్రునికైన నైశ్వర్యములను హరించును.

శ్లో॥ అజారజః ఖరరజ స్తథాసమ్మార్జనీరజః। స్త్రీణాంపాద
రజశ్చైవ శక్రస్యాపి శ్రియంహరేత్।

టీ॥ అజా= మేకలయొక్క, రజః= కాలిదుమ్ము, ఖర= గాడిదయొక్క రజః= కాలిదుమ్ము, తథా= అట్లునే సమ్మార్జనీ= చీపురు కట్టయొక్క రజః= దుమ్ము, స్త్రీణాం= స్త్రీలయొక్క, పాదరజశ్చైవ= కాలిదుమ్మున్ను, శక్రస్య= ఇంద్రుని యొక్క, శ్రియమపి= సంపత్తునున్ను, హరేత్ = హరించును.

తా॥ మేకలకాలిదుమ్ము గాడిదకాలి దుమ్ము చీపురుకట్టయొక్క దుమ్ము స్త్రీల యొక్క కాళ్ళ దుమ్ము ఇవి ఇంద్రుని యైశ్వర్యమును గూడ హరించును.

శ్లో॥ కృషితోనాస్తిదుర్భిక్షం జపతోనాస్తిపాతకం।
మౌనేనకలహోనాస్తినాస్తిజాగరతోభయం॥

టీ. కృషితః= కృషివలన, దుర్భిక్షం= కాటకము, నాస్తి= లేదు, జపతః= జపముచేసికొనువానికి, పాతకం= పాపము, నాస్తి = లేదు, మౌనేన= మౌనముచేత, కలహః= పోట్లాట, నాస్తి= లేదు, జాగరతః= మేలుకొనియుండుటవలన, భయం= భయము, నాస్తి= లేదు.

తా॥ కృషిచేసికొనువానికి కఱవులేదు, జపముచేసికొనువారికిపాపము లేదు. మౌన మవలంబించినయెడల కలహములేదు. మేలుకొనియున్నయెడల భయముండదు.

శ్లో॥ ఏకోపిగుణవాన్పుత్రో నిర్గుణేన శతైరపి। ఏక
చంద్రప్రకాశేన నక్షత్రైఃకింప్రయోజనమ్ ॥

టీ. గుణవాన్ = గుణవంతుఁడైన, పుత్రః = కొడుకు, ఏకోఽపి = ఒక్కఁడైనను, (అలం = చాలును) నిర్గుణేన = గుణవంతులుకానట్టి, శతైరపి = నూఱిటితోడను, కింప్రయోజనం = ఏమిప్రయోజనము. ఏకచంద్రప్రకాశేన = ఒక్కచంద్రునిప్రకాశముచేత (అలం = చాలును,) శతైః = అనేకములైన, నక్షత్రైః = నక్షత్రములచేత, కింప్రయోజనం = ఏమిప్రయోజనము.

తా॥ సకలగుణసంపన్నుండయిన కుమారుఁడొక్కఁడేచాలును. దుర్మార్గులైనకుమారులు నూఱుగురున్న నేమిప్రయోజనము. ఒక్కచంద్రుఁడుదయమైన లోకమునంతయును ప్రకాశింపఁజేయును. ఆచంద్రుఁడు లేకనక్షత్రము లెన్నియున్న నేమిప్రయోజనము?

శ్లో॥ ప్రస్తావసదృశంవాక్యం స్వభావసదృశంక్రియామ్।
ఆత్మశక్తిసమంకోపం యోజానాతిసపండితః॥

టీ. ప్రస్తావ = ప్రస్తావనకు, సదృశం = తగిన, వాక్యం = మాటను, స్వభావ = స్వభావమునకు, సదృశం = తగిన, క్రియాం = క్రియను, ఆత్మ = తనయొక్క, శక్తిసమం = శక్తికిఁదగిన, కోపం = కోపము, యః = ఎవఁడు, జానాతి = తెలిసికొనుచున్నాఁడో, సః = అతఁడు, పండితః = పండితుఁడు.

తా॥ ప్రస్తావనకు దగినమాట, స్వభావమునకుఁదగిన కార్యము, తన శక్తికి దగిన కోపము, నెవఁడెఱుంగునో యాతఁడే పండితుఁడు.

శ్లో॥ వివాదశీలాంస్వయమర్థచోరిణీంపరానుకూలాంపరిహాస
భాషిణీం। అగ్రాశినీమన్యగృహప్రవేశినీంత్యజంతిభార్యాం
దశపుత్రమాతరం॥

టీ. వివాదశీలాం= జగడమాడుస్వభావముకలిగినట్టియు, స్వయం= తానే అర్థచోరిణీం= (తనయింటి)సొత్తును దొంగిలించునట్టియు, పరాననుకూలాం = ఇతరులకనుకూలురాలగునట్టియు,పరిహాసభాషిణీం= (పరపురుషులతో) నవ్వులాడునట్టియు, అగ్రాశినీం= (పెనిమిటికంటె) ముందుతినునట్టియు, అన్యగృహప్రవేశినీం= ఇతరులగృహమందు సంచరించునట్టియు, భార్యాం = పెండ్లామును, దశపుత్రమాతరం= పదిమందికొడుకుల తల్లిని (వలె) త్యజంతి= విడుతురు.

తా॥ జగడమాడుస్వభావముగలదానిని, ఇంటిసొమ్ము దొంగిలించుదానిని, పరులకనుకూలమైనదానిని, పరపురుషులతోఁ బరిహాసమాడుదానిని, పెనిమిటికన్న ముందుభుజించుదానిని, ఎల్లప్పుడును పొరుగింటిలో సంచరించుదానిని, ఇట్టిభార్యను పదిమంది బిడ్డలతల్లినివలె విడువవలెను.

శ్లో॥ కార్యేషుదాసీకరణేషుమంత్రీ రూపేచలక్ష్మీః క్షమయా
ధరిత్రీ। స్నేహేచమాతాశయనేతువేశ్యా షట్కర్మయు
క్తాకులధర్మపత్నీ॥

టీ॥ కులధర్మపత్నీ= కులస్త్రీ, కార్యేషు= ఇంటిపనులయందు, దాసీ= దాసి (వలెను) కరణేషు= మంత్రాలోచనములయందు, మంత్రీ= మంత్రి (వలెను) రూపే= ఆకారమందు, లక్ష్మీః= లక్ష్మి (వలెను) క్షమయా= ఓర్పుచేత, ధరిత్రీ= భూదేవి (వలెను) స్నేహే= స్నేహమందు, మాతాచ= తల్లి (వలెను) శయనేతు= పడకయందు, వేశ్యా= భోగముది (వలెను)షట్కర్మయుక్తా=ఈయారుగుణములతోకూడినది, స్యాత్ (అగును.)

తా॥ ఇంటికార్యములయందు దాసివలెను, కార్యాలోచనయందు మంత్రివలెను, రూపమందు లక్ష్మివలెను, ఓర్పునందు భూదేవివలెను, స్నేహమందు తల్లివలెను, పడకయందు వేశ్యవలెను, ఈరీతిగపతివిషయమయి ప్రవర్తించునట్టిది కులస్త్రీ యనబడును.

శ్లో॥ నవిషంవిషమిత్యాహుర్బ్రహ్మస్వంవిషముచ్యతే।
విషమేకాకినంహంతి బ్రహ్మస్వంపుత్రపౌత్రకమ్॥

టీ॥ విషం = విషము, విషమితి = విషమని, నాహుః = చెప్పరు, బ్రహ్మస్వం = బ్రాహ్మణధనము, విషం (ఇతి) = విష (మని) ఉచ్యతే = చెప్పబడు చున్నది, విషం = విషము, ఏకాకినం (త్రాగిన) = ఒక్కనినే, హంతి = చంపును, బ్రహ్మస్వం = బ్రాహ్మణధనము, పుత్రపౌత్రకం = పు త్రపౌత్రాదులను కూడ, (హంతి = చంపును.)

తా॥ విషము విషము గాదు బ్రాహ్మణులసొమ్ము విషము. విషమువలన నొక్కడే చచ్చును. బ్రాహ్మణులసొమ్ము నపహరించినవాని పుత్రపౌత్రాదు లుగూడ నాశనమొందుదురు.

శ్లో॥ శతనిష్కోధనాఢ్యశ్చ శతగ్రామేణభూపతిః।
శతాశ్వఃక్షత్రియోరాజా శతశ్లోకేనపండితః॥

టీ॥ శతనిష్కః = నూరువరాలుగలవాడు, ధనాఢ్యః = ధనవంతుడు, శతగ్రామేణ = నూరుగ్రామములు (కలిగియుండుట) చేత, భూపతిః = భూమిపతి, శతాశ్వః = నూరుగుఱ్ఱములుగల, క్షత్రియః = క్షత్రియుడు, రాజా = రాజు, శతశ్లోకేన = నూరుశ్లోకములు (వచ్చియుండుట) చేత, పండితః = పండితుడు, (ఇతి ఉచ్యతే = అని చెప్పబడుచున్నది.)

తా॥ నూరువరాలుకలిగినవాడు ధనికుడనిపించుకొనును. నూరుగ్రామములుకలవాడు భూపతి యనిపించుకొనును. నూరుగుఱ్ఱములు గలవాడు రాజనిపించుకొనును. నూరు శ్లోకములు నేర్చినవాడు పండితుడనిపించు కొనును.

శ్లో॥ శకటంపంచహస్తేషుదశహస్తేషువాజినం।
గజంహస్తసహస్రేచ దుష్టందూరేచవర్జయేత్॥

టీ॥ శకటం = బండిని, (దృష్ట్వా = చూచి,) పంచహస్తేషు = ఐదుచేతులందు (ఐదుమూరలదూరమందు) వర్జయేత్ = తొలగవలెను. వాజినం = గుఱ్ఱమును, (దృష్ట్వా = చూచి,) దశహస్తేషు = పదిచేతులందు, (పదిచేతుల దూరమున వర్జయేత్ = తొలగవలెను. గజం = యేనుగును, దృష్ట్వా = చూచి హస్తసహస్రేచ = వేయిచేతులయందు (వేయి చేతుల దూరమందు

వర్జయేత్ = తొలఁగవలెను. దుష్టం = దుష్టుని (దృష్ట్వా = చూచి) దూరే = చాలదూరమందు, వర్జయేత్ = తొలఁగవలెను.

తా॥ బండిని చూచిన నైదుమూరల దూరము తొలగిపోవలెను. గుఱ్ఱమునుఁజూచిన పదిమూరల దూరము తొలగిపోవలెను. ఏనుగును జూచిన వేయిమూరల దూరము దొలఁగిపోవలెను. దుర్జనుని జూచిన మిక్కిలి దూరముగాఁ దొలఁగిపోవలెను.

శ్లో॥ అనభ్యాసేవిషంశాస్త్ర మజీర్ణేభోజనంవిషమ్।
దరిద్రస్యవిషంగోష్ఠీవృద్ధస్యతరుణీవిషమ్॥

టీ॥ అనభ్యాసే = అభ్యాసములేనియెడల, శాస్త్రం = శాస్త్రము, విషం = విషము, అజీర్ణే = అజీర్ణముగనుండఁగా, భోజనం = భోజనము, విషం = విషము, దరిద్రస్య = పేదవానికి, గోష్ఠీ = సభ, విషం = విషము, వృద్ధస్య = ముదుసలికి, తరుణీ = పడుచుది, విషం = విషము

తా॥ అభ్యాసములేనివానికి శాస్త్రమే విషము. జీర్ణము కాకున్నపుడు భోజనమే విషము. దరిద్రునకు సభయే విషము. ముదుసలికి పడుచు పెండ్లాము విషము.

శ్లో॥ జిహ్వాగ్రేవర్తతేలక్ష్మీర్జిహ్వాగ్రేమిత్రబాంధవాః।
జిహ్వాగ్రేబంధనప్రాప్తిర్జిహ్వాగ్రేమరణంధ్రువమ్॥

టీ॥ లక్ష్మీః = సంపత్తు, జిహ్వాగ్రే = నాలుకచివరయందు, వర్తతే = ఉన్నది. (అనఁగా నాలుకవలననే సంపత్తుగలుగును అట్టులపైన నూహించుకొన దగినది.) జిహ్వాగ్రే = నాలుక చివరయందు, మిత్రబాంధవాః = స్నేహితులు బందుగులు (వర్తంతే = ఉన్నారు,) జిహ్వాగ్రే = నాలుకచివరయందు బంధనప్రాప్తిః = సంకెలలు పొందుట. జిహ్వాగ్రే = నాలుకచివర, మరణం = చావు, ధ్రువం = నిశ్చయము.

తా॥ నాలుకవలన సంపత్తు గలుగును. నాలుకవలన చుట్టాలు స్నేహితులును వత్తురు. నాలుకవలన సంకెలలు ప్రాప్తమౌను. నాలుకవలన చావు గలుగును. కావున నాలుకను జాగ్రత్తగా వాడుకొనవలెను.

శ్లో॥ అదానదోషేణభవేద్దరిద్రోదారిద్ర్యదోషేణకరోతిపాపమ్।
పాపాదవశ్యంనరకంప్రయాతి పునర్దరిద్రఃపునరేవపాపీ॥

టీ॥ అదానదోషేణ = దానమిచ్చుట లేకపోవుటయను దోషము చే దరిద్రః = పేదవాఁడు, భవేత్ = అగును. దారిద్ర్యదోషేణ = పేదతిక ము ను దోషముచేత పాపం = పాపమును కరోతి = చేయును. పాపాత్ = పాపమువలన అవశ్యం = అవశ్యముగా, నరకం = నరకమును ప్రయాతి = పొందు చున్నాఁడు పునః = తిరిగి దరిద్రః = పేదవాఁడు, [అగును] పునః తిరిగి, పాపీఏవ = పాపియే, భవేత్ = అగును.

తా॥ పూర్వజన్మమందు నొకరికివ్వనిదోషంబున దరిద్రుఁడగును. ఆ దారిద్ర్యమువలనపాపమొనర్చును. ఆపాపమువలననరకముప్రాప్తించును. ఆ నరకమందు గొన్నాళ్లుండి వచ్చి దరిద్రుఁడైపుట్టును. తిరిగిపాపములుచేయు ను ఇట్టులనేపుట్టుచుచచ్చుచునుండును.

శ్లో॥ అతిథిర్బాలకశ్చైవ స్త్రీజనోనృపతిస్తథా।ఏతే
విత్తంనజానంతిజామాతాచైవపంచమః॥

టీ॥ అతిథిః = యాచకుఁడు, బాలకశ్చ = బాలుఁడు, స్త్రీజనః = స్త్రీసముదాయము, తథా = అట్లనే, నృపతిః = రాజున్ను, పంచమః = ఐదవవాఁడు, జామాతా = అల్లుఁడు, ఏతే = వీరు, విత్తం = సంపదను, నజానంతి = తెలుసుకొనరు.

తా॥ యాచకుఁడు, బాలుఁడు, స్త్రీలు, రాజు, అల్లుఁడు, వీరుకలిమి లేము లెరుఁగలేరు.

శ్లో॥ కుదేశంచకుమిత్రంచ కురాజ్యంచకుబాంధవమ్।
కుభార్యాంచకురాష్ట్రించదూరతఃపరివర్జయేత్॥

టీ॥ కుదేశం = చెడ్డదేశమును, కుమిత్రం = కుత్సితుఁడగు స్నేహితుని కురాజ్యం = కొరగానిదొరతనము, కుబాంధవం = కొరగానిబంధువును, కుభార్యాం = చెడ్డదియగుభార్యను, కురాష్ట్రించ చెడ్డపట్టణమును, దూరతః = దూరముగా, పరివర్జయేత్ = విడిచిపెట్టవలెను

తా॥ కొరగానిదేశంబును కొరగానిస్నేహితుఁడు కొరగానిరాజ్యము కొరగానిబంధువు చెడ్డదియగుభార్యను చెడ్డపత్తనమును దూరముగావిడువవలెను.

శ్లో॥ స్త్రీణాంద్విగుణఆహారంబుద్ధిశ్చాపిచతుర్గుణా।
సాహసంషడ్గుణంచైవ కామోష్టగుణఉచ్యతే॥

టీ॥ స్త్రీణాం = స్త్రీలకు, ఆహారం = భోజనము, (పురుషులకంటె) ద్విగుణం = రెట్టింపు, బుద్ధిశ్చాపి = బుద్ధియును, (పురుషులకంటె) చతుర్గుణం = నాల్గురెట్లు, సాహసం = తెగింపు, (పురుషులకంటె) షడ్గుణం = ఆరురెట్లు, కామః = కామము, (పురుషులకంటె) అష్టగుణం = ఎన్మిదిరెట్లు

తా॥ స్త్రీలకు పురుషులకంటె నాహారము రెండుపాళ్ళధికము. బుద్ధి నాల్గుపాళ్ళధికము. సాహస మారుపాళ్ళు మెండు. కామమెనిమిదిపాళ్లధికము.

శ్లో॥ రాజారాష్ట్రకృతంపాపంరాజపాపంపురోహితః।
భర్తాచస్త్రీకృతంపాపంశిష్యపాపంగురుర్వ్రజేత్॥

టీ॥ రాజా = రాజు, రాష్ట్రకృతం = రాజ్యమందుండు ప్రజలచేచేయఁబడిన పాపం = పాపమును, వ్రజేత్ = పొందును, పురోహితః = పురోహితుడు, రాజపాపం = రాజుయొక్కపాపమును, వ్రజేత్ = పొందును, భర్తాచ = మగఁడు, స్త్రీకృతం = భార్యచేఁచేయఁబడిన, పాపం = పాపము వ్రజేత్ = పొందును, గురుః = ఉపాధ్యాయుడు, శిష్యపాపం = శిష్యుని పాపమును, వ్రజేత్ = పొందును.

తా॥ తనదేశములోఁ బ్రజలుచేయుపాపమును రాజుపొందును. రాజుచేయుపాపమును బురోహితుఁడుపొందును। పెండ్లాముచేయు పాపమును మగఁడుపొందును. శిష్యుఁడు చేయుపాపమును గురువుపొందును.

శ్లో॥ గీతేవాద్యేతథానృత్తే సంగ్రామేరిపుసంకటే।
ఆహారేవ్యవహారేచత్యక్తలజ్జస్సుఖీభవేత్॥

టీ॥ గీతే = గానముసేయు కాలమందును, వాద్యే = వాద్యముచేయుసమయమందును, తథా = అట్లనే, నృత్తే = నృత్యముచేయుసమయమందును, సం

గ్రామే = యుద్ధముచేయు సమయమునందును, రిపుసంకటే = శత్రువులతో బోరు నప్పుడు, ఆహారే = భోజనమందును, వ్యవహారేచ = వ్యవహారమాడు సమయమందును, త్యక్తలజ్జః = విడిచి సిగ్గుగలవాడు, సుఖీ = సుఖవంతుఁడు భవేత్ = అగును.

తా॥ గానముచేయునపుడు వాద్యము వాయించునపుడు, నృత్తమాడునపుడు యుద్ధముచేయునపుడు శత్రువులతో బోరాడునపుడు భోజనముచేయునపుడు వ్యవహారమాడునపుడును సిగ్గులేనివాఁడైన యెడల సుఖవంతుఁడగును.

శ్లో॥ రూపయౌవనసంపన్నా విశుద్ధకులసంభవాః।
విద్యాహీనా నశోభంతే నిర్గంధమివకింశుకం॥

టీ॥ రూప = రూపముచేతను, యౌవన = జవ్వనముచేత, సంపన్నాః = సంపన్నులైనప్పటికిని, విశుద్ధ = పరిశుద్ధమైన, కుల = వంశమందు సంభవాః = పుట్టినవారైనప్పటికి, విద్యాహీనాః = చదువులేనివారు, నిర్గంధం = వాసనలేని, కింశుకమివ = మోదుగపువ్వువలె, నశోభంతే = ప్రకాశింపరు.

తా॥ రూపయౌవనసంపత్తిగలిగి మంచికులమున పుట్టినవారైనను చదువులేనియెడల వాసనలేని మోదుగపువ్వువలె ప్రకాశింపరు.

శ్లో॥ త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులంత్యజేత్।
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీంత్యజేత్॥

టీ॥ కులస్యార్థే = ఒకకులమునిమిత్తము (ఒకకులమునకాపత్తుకలిగిన పుడు దానికిగాను) ఏకం = ఒక్కనిని, త్యజేత్ = విడువవలయును, గ్రామస్య = గ్రామముయొక్క, అర్థే = నిమిత్తమై, కులం = వంశమును, త్యజేత్ = విడువవలయును, జనపదస్యార్థే = దేశమునిమిత్తము, గ్రామం = గ్రామమును, త్యజేత్ = విడువవలయును, ఆత్మార్థే = తననిమిత్తము, పృథివీం = భూమిని త్యజేత్ = విడువవలయును.

తా॥ ఒకకులమునకు హానికలిగినపుడు అందుకు హేతుభూతుఁడైన వానిని విడువవలయును. ఒకగ్రామమునకు హానికలుగునపుడు దానికి హే

తువైన యొకవంశమును విడువవలయును. ఒకదేశమునకు హానికలుగునప్పుడు దానికి హేతువైన యొకగ్రామమును విడువవలయును. తనకుహానికలుగునప్పుడు తనకున్న భూమినంతయు విడువవలెను.

శ్లో॥ కోకిలానాంస్వరోరూపంపాతివ్రత్యంతుయోషితాం।
విద్యారూపంవిరూపాణాంక్షమారూపంతపస్వినాం॥

టీ॥ కోకిలానాం= కోయిలలకు, స్వరః= కంఠస్వరమే, రూపం= చక్కనిరూపము, యోషితాం= స్త్రీలకు, పాతివ్రత్యం= పతివ్రతాధర్మమే, రూపం= అందమైనయాకారము, విరూపాణాం= సుందరమైనరూపము లేనివారలకు, విద్యా= విద్యయే, రూపం= రూపము, తపస్వినాం= మునులకు, క్షమ= సహనమే, (ఓర్పు)రూపం= రూపము.

తా॥ కోయిలలకు కంఠస్వరమే రూపము. స్త్రీలకు పతివ్రతాధర్మమేరూపము. కురూపులకు విద్యయేరూపము. యోగులకు ఓర్పేరూపము.

శ్రీకృష్ణఉవాచ= శ్రీకృష్ణమూర్తి పలికెను.

శ్లో॥ దైవాధీనంజగత్సర్వంమంత్రాధీనంతుదైవతం।
తన్మంత్రంబ్రాహ్మణాధీనంబ్రాహ్మణోమమదేవతా॥

టీ॥ సర్వం= సమస్తమైన, జగత్= ప్రపంచకమున్ను, దైవాధీనం= దైవముయొక్క యధీనము, దైవతం= ఆదైవము, మంత్రాధీనం= మంత్రముయొక్క యధీనము, తత్= ఆ, మంత్రం= మంత్రము, బ్రాహ్మణాధీనం= బ్రాహ్మణునియొక్క యాధీనము, (తతః= కనుక) బ్రాహ్మణః= బ్రాహ్మణుఁడు, మమ= నాయొక్క, దేవతా= దైవము.

తా॥ ఈలోకము దైవాధీనమై యుండును. ఆదైవము మంత్రాధీనమై యుండును. ఆమంత్రము బ్రాహ్మణాధీనమై యున్నది. కాబట్టి బ్రాహ్మణుఁడు నాకుదైవము.

శ్లో॥ పిబంతినద్యస్స్వయమేవనాంభః ఖాదంతినస్వాదుఫలాని
వృక్షాః। పయోధరాస్సస్యమదంతినైవపరోపకారాయ
సతాంవిభూతయః॥

టీ॥ నద్యః = నదులు, అంభః = ఉదకమును, స్వయం = తాము, నపిబంత్యే
వ = త్రాగవు, వృక్షాః = చెట్లు, స్వాదుఫలాని = తియ్యనిపండ్లను, నఖా
దంతి = తినవు, పయోధరాః = మేఘములు, సస్యం = పైరును, నాదంత్యే
వ = తినవు, సతాం = మంచివారలయొక్క, విభూతయః = సంపదలు, ప
రోపకారాయ = ఇతరులకుపకారము చేయుటకు, (ఉపయుజ్యంతే = ఉ
పయోగింపబడుచుండును.)

తా॥ నదులు తమజలమునకొంచెమైనను త్రాగక నితరులకొఱకే విని
యోగించును. చెట్లు తాముకలిగించినపండ్లను తాముభుజింపక యితరులకొ
ఱకే వినియోగించును. మేఘములు తాముపర్షింపఁగా పండినపంటను తామ
నుభవింపవు అట్లనే మంచివారలు తాముసంపాదించిన సంపత్తులు పరోప
కారమునకే నుపయోగింతురు.

శ్లో॥ పక్షిణాంబలమాకాశంమత్స్యానాముదకంబలం।
దుర్బలస్యబలంరాజాబాలానాంరోదనంబలం॥

టీ॥ పక్షిణాం = పక్షులకు, ఆకాశం = ఆకసమే, బలం = బలము,
మత్స్యానాం = చేపలకు, ఉదకం = నీరే, బలం = బలము, దుర్బలస్య =
బలములేనివారికి, బలః = బలము, రాజా = రాజు, బాలానాం = పసిపిల్లల
కు, బలం = బలము, రోదనం = ఏడుపు.

తా॥ పక్షులకు ఆకాశముబలము. చేపలకు నీళ్లుబలము. బలహీనునకు
రాజుబలము. చిన్నివాండ్రకు రోదనమేబలము.

శ్లో॥ వృశ్చికస్యవిషంపుచ్ఛంమక్షికస్యవిషంశిరః।తక్ష
కస్యవిషందంష్ట్రాసర్వాంగందుర్జనేవిషం॥

టీ॥ వృశ్చికస్య = తేలునకు, పుచ్ఛం = తోక, విషం = విషమయమై
నది, మక్షికస్య = ఈగయొక్క, శిరః = తల, విషం = విషమయమైనది, త
క్షకస్య = సర్పమునకు, దంష్ట్రా = కోఱు, విషం = విషపూరితమైనది. దుర్జ
నే = చెడ్డవానియందు, సర్వాంగం = శరీరమంతయు విషం = విషమయమైనది.

తా॥ తేలునకు తోకయందు-ఈగకు తలయందు-పామునకు కోరల
యందు-దుర్జనునికి సర్వాంగములయందును విషముండును

శ్లో॥ పుస్తకేషు చయావిద్యాపరహస్తే చయద్ధనం।స
మయేతుపరిప్రాప్తేనసావిద్యానతద్ధనం॥

టీ॥ యా = ఏ, విద్యా = విద్య, పుస్తకేషు = పుస్తకములయందు (ఉన్నదో) యత్ = ఏ, ధనం = ధనము, పరహస్తే = ఇతరునిచేతియం దు, (ఉండునో) సమయే = సమయము, పరిప్రాప్తే = ప్రాపింపఁగా, సా = ఆవిద్య, విద్యాన = విద్యగాదు, తత్ = ఆధనం, నధనము = ధనము గాదు.

తా॥ పుస్తకములలోనున్నచదువు పరహస్తమందున్న ద్రవ్యమును. సమయమున నుపయోగింపదు.

శ్లో॥ నశ్యత్యనాయకంకార్యంతథైవశిశునాయకం।
స్త్రీనాయకంతథోన్మత్తనాయకంబహునాయకం॥

టీ॥ అనాయకం = నాయకుఁడులేనట్టి, కార్యం = కార్యమున్ను, తథైవ = అట్లనే, శిశునాయకం = బాలుఁడుయజమానుఁడైనట్టి, (కార్యం = కార్యమున్ను) తథా = అట్లనే, స్త్రీనాయకం = స్త్రీలుయజమానులుగాగల, (కార్యమున్ను) ఉన్మత్తనాయకం = పిచ్చివాండ్రుయజమానులుగాగల కా ర్యమున్ను, బహునాయకం = అనేకులు నాయకులుగాగల కార్యమున్ను, నశ్యతి = నశించును.

తా॥ నాయకుఁడులేనట్టియు. బాలుఁడు. స్త్రీలు. పిచ్చివాండ్రు. అనే కులు నాయకులుగాగలిగిన కార్యములు చెడిపోవును గాని బాగుపడవు.

శ్లో॥ అభ్యాసానుసరీవిద్యా బుద్ధిఃకర్మానుసారిణీ।
ఉద్యోగసారిణీలక్ష్మీఃఫలంభాగ్యానుసారిచ॥

టీ॥ విద్యా = చదువు, అభ్యాసానుసరీ = అలవాటుననుసరించినదై (యుండును) బుద్ధిః = బుద్ధి, కర్మానుసారిణీ = (తానుపూర్వజన్మమునఁజేసి కొనిన) కర్మమునననుసరించినదై(యుండును) లక్ష్మీః = సంపద, ఉద్యోగసారి ణీ = ఉద్యోగముననుసరించినదై(ఉండును) ఫలం = లాభము, భాగ్యానుసా రిచ = అదృష్టముననుసరించినదై (ఉండును.)

తా॥ అభ్యాసమువలన విద్యవచ్చును. బుద్ధికర్మననుసరించియుండును. సంపద ఉద్యోగముననుసరించి యుండును. ఫలితము అదృష్టముననుసరించి యుండును.

శ్లో॥ వసంతయౌవనావృక్షాఃపురుషాధనయౌవనాః।స్త్రీ
భాగ్యయౌవనానార్యోయువానోవిద్యయాబుధా॥

టీ॥ వృక్షాః= చెట్లు, వసంతయౌవనాః= వసంతకాలమే యౌవనముగాగలవి, పురుషాశ్చ= పురుషులు, ధనయౌవనాః= ధనమే యౌవనముగాగలవారలు, నార్యః= స్త్రీలు, భాగ్యయౌవనాః= భాగ్యమేయౌవనముగాగలవారలు, బుధాః= పండితులు, విద్యయా= విద్యచేత, యువానః= యువకులు.

తా॥ వృక్షములకు వసంతమే యౌవనము. పురుషులకు ధనమేయౌవనము. స్త్రీలకు భాగ్యమేయౌవనము. పండితులకు విద్యయేయౌవనము.

శ్లో॥ వృధావృష్టిస్సముద్రేచవృధాతృప్తేతుభోజనం।
వృధాధనపతేదానందరిద్రేయౌవనంవృధా॥

టీ॥ సముద్రే= సముద్రమందు, వృష్టిః= వర్షము, (వర్షించుట) వృధా= వ్యర్థము, తృప్తేతు= భోజనములచే (తృప్తుడైనవానియందు) భోజనం= భోజనము, వృధా= వ్యర్థము,ధనపతే= డబ్బుగలవానికి, దానం= దానము, వృధా= వ్యర్థము, దరిద్రే= పేదవానియందు, యౌవనం= యౌవనము, వృధా= వ్యర్థము

తా॥ సముద్రమున వర్షించుట. ఆకలిలేనివానికి భోజనముపెట్టుట. ధనవంతునకు దానముచేయుట. దరిద్రునకు గలయౌవనము వ్యర్థములు.

శ్లో॥ అర్థాగృహేనివర్తంతేశ్మశానేమిత్రబాంధవాః।
సుకృతందుష్కృతంచైవగచ్ఛంతమనుగచ్ఛతి॥

టీ॥ అర్థాః= ధనములు, గృహే= గృహమందే, నివర్తంతే= మరలుచున్నది. (వెనువెంటవెళ్ళక యిచ్చటనేయుండును) మిత్రబాంధవాః= స్నేహితులు బంధువులు, శ్మశానే= వల్లకాటియందు, వర్తంతే= మరలు

చున్నారు, సుకృతం = పుణ్యం,దుష్కృతంచైవ = పాపమే, గచ్ఛంతం = వె ళ్ళువానిని, అనుగచ్ఛతి = అనుసరించి వెళ్ళుచున్నది.

తా॥ ధనముసంపాదించి ధర్మముచేయక దాచినను లోకాంతరగతుఁ డైనపుడాధనము గృహమందుండునుగాని వెనువెంటరాదు. పుత్రమిత్రబాంధవులు శ్మశాన పర్యంతమునత్తురు ఆవెనుకతన వెంటరారు. పుణ్యపాపములు రెండును మాత్రము వెనువెంటవచ్చును.

శ్లో॥ తస్కరస్యవధోదండో దాసీదండస్తుముండనం। భా
ర్యాదండఃపృథక్ఛయ్యామిత్రదండమభాషణం

టీ॥ తస్కరస్య = దొంగకు, దండః = దండనము, వధః = వధించుటయే, దాసీదండః = దాసీదానికి దండనము, ముండనం = తలగొరిగించుట భార్యాదండః = భార్యనుదండించుట, పృథక్ఛయ్యా = వేరుపడకయే, మిత్రదండః = స్నేహితునిదండించుట, అభాషణం = మాటాడకుండుటయే.

తా॥ దొంగకు హింసించుట దండనము. దాసికి తలగొరిగించుటదండనము. భార్యకు పక్కఅను రానీయక వేరుగాపరుండపెట్టుట దండనము. మిత్రునికి మాట్లాడకుండుటయే దండనము.

శ్లో॥ పితాచఋణవాన్ శత్రుర్మాతాచవ్యభిచారిణీ।
భార్యారూపవతీశత్రుఃపుత్రశ్శత్రురపండితః।

టీ॥ ఋణవాన్ = అప్పుగలిగిన, పితా = తండ్రి, శత్రుః = విరోధి వ్యభిచారిణీ = అంకుటాలైన, మాతా = తల్లి, శత్రుః = శత్రువు, రూపవతీ = మంచిరూపముగలిగిన, భార్యా = పెండ్లాము, శత్రుః = విరోధి, అపండితః = పండితుండుగాని, పుత్రః = కుమారుడు, శత్రుః = శత్రువు.

తా॥ కుమారుల కప్పుపెట్టిపోయినతండ్రి శత్రువు అంకుటాలైనతల్లి శత్రువు సౌందర్యవతియైన పెండ్లాము శత్రువు. విద్యలేనికొడుకు తండ్రికి శత్రువు.

శ్లో॥ పితారక్షతికౌమారే భర్తారక్షతియౌవనే। ర
క్షంతివార్ధకేపుత్రాన స్త్రీస్వాతంత్ర్యమర్హతి॥

టీ॥ కౌమారే = బాల్యమందు, పితా = తండ్రి, రక్షతి = కాపాడుచున్నాడు, యౌవనే = యౌవనమందు, భర్తా = పెనిమిటి, రక్షతి = కాపాడుచున్నాడు, వార్ధకే = ముసలితనమందు, పుత్రాః = కొడుకులు, రక్షంతి = కాపాడుదురు, (కాబట్టి) స్త్రీ = ఆడుది, స్వాతంత్ర్యం = స్వతంత్రతను, నార్హతి = పొందదు.

తా॥ ఆడుదానిని బాల్యమందుతండ్రియు యౌవనమందు మగడును ముసలితనమందు పుత్రులును కాపాడుదురు. కనుక ఆడుదానికి స్వాతంత్ర్యమెప్పుడును లేదు.

శ్లో॥ అగ్నిహోత్రంగృహంక్షేత్రంగర్భిణీంవృద్ధబాలకౌ।
రిక్తహస్తేననోపేయాద్రాజానందైవతంగురుం॥

టీ॥ అగ్నిహోత్రం = అగ్నినిగూర్చియు, గృహం = ఇంటినిగూర్చియు, క్షేత్రం = పుణ్యక్షేత్రమునుగూర్చియు, గర్భిణీం = గర్భిణీస్త్రీనిగూర్చియు, వృద్ధబాలకౌ = వృద్ధులనుగూర్చి బాలురనుగూర్చియు, దైవతం = దేవునిగూర్చియు, రాజానం = రాజునుగూర్చియు, గురుం = గురువునుగూర్చియు(వెళ్లునప్పుడు) రిక్తహస్తేన = వట్టిచేతితో, నోపేయాత్ = బోరాదు.

తా॥ అగ్నిహోత్రునకు మంత్రపూర్వకముగా నాహుతులిచ్చునప్పుడును, గృహము, పుణ్యక్షేత్రము, గర్భిణీస్త్రీలు, వృద్ధులు, బాలురు, రాజులు, దేవుడు, గురువు, వీరలకడకు బోవునప్పుడు వట్టిచేతులతో బోగూడదు ఫలములనువేనినైనను దీసికొనిపోవలయును.

శ్లో॥ అహోప్రకృతిసాదృశ్యంశ్లేష్మణోదుర్జనస్యచ।
మధురైఃకోపమాయాతికటుకైరుపశామ్యతి।

టీ॥ శ్లేష్మణః = శ్లేష్మరోగముగలవానికని, దుర్జనస్య = దుర్జనునకును, ప్రకృతిసాదృశ్యం = ప్రకృతివలనగలిగినసామ్యము, అహో = అహహా, మధురైః = తీపుచే (మధురములగుమాటలచేనని దుర్జనపక్షము) కోపం = అలుక, ఆయాతి = వచ్చును, కటుకైః = చేదుచే(తీక్ష్ణములైనమాటలచేనని దుర్జనపక్షము) ఉపశామ్యతి = అడగియుండును.

తా॥ దుర్జనునకును శ్లేష్మరోగమునకును సామ్యముగలదు. ఏలయనిన శ్లేష్మరోగము తీపుచేవృద్ధినిబొందును. చేదుచేనశించును అట్లనే చెడ్డవానికి మంచిమాటలచేత కోపముగలుగును కఠినమాటలచే నడఁగియుండును.

శ్లో॥ జనితాచోపనీతాచయేనవిద్యోపదిశ్యతే।అన్న
దాతాభయత్రాతాపంచైతేపితరఃస్మృతాః॥

టీ॥ జనితాచ = తండ్రియు, ఉపనేతాచ = ఉపనయనమునుచేసిన వాఁడు, యేన = ఎవనిచేత, విద్యా = చదువు, ఉపదిశ్యతే = ఉపదేశింపఁబడుచున్నదో, (సః = వాడున్ను) అన్నదాతా = అన్నదానమునుచేయువాఁడున్ను, భయత్రాతా = భయమునుండి కాపాడినవాడున్ను, ఏతే = ఈ, పంచ = ఐదుగురును, పితరః = తండ్రులుగా,స్మృతాః = దలంపఁబడుచున్నారు.

తా॥ కన్నతండ్రి, ఉపనయనముచేసినవాఁడు, విద్యచెప్పినవాఁడు, అన్నముపెట్టినవాఁడు, భయముదీర్చినవాఁడు, ఈ ఐదుగురును తండ్రులని చెప్పబడుదురు.

శ్లో॥ దరిద్రాయకృతందానం శూన్యలింగస్యపూజనం।
అనాథప్రేతసంస్కారమశ్వమేధసమంవిదుః

టీ॥ దరిద్రాయ = పేదవానికొఱకు. కృతం = చేయఁబడిన, దానం = దానమున్ను, శూన్యలింగస్య = పూజమొదలైనవిలేని లింగముయొక్క, పూజనం = పూజ, అనాథప్రేతసంస్కారం = దిక్కులేని పీనుగునెత్తికాల్చుట, (ఇవి) అశ్వమేధసమం = అశ్వమేధమను యజ్ఞముతో సమానమైనవిగా, విదుః = తెలిసికొనుచున్నారు.

తా॥ దరిద్రునకు చేయుదానము, పూజాదులులేని లింగమునకు చేయుపూజ,దిక్కులేని పీనుగును కాల్చుట,ఇవి అశ్వమేధయజ్ఞముతో సమానమైనవని తెలియవలెను.

శ్లో॥ దాతృత్వంప్రియవక్తృత్వంధీరత్వముచితజ్ఞతా।
అభ్యాసేననలభ్యంతేచత్వారస్సహజాగుణాః॥

టీ॥ దాతృత్వం = ఈవి, ప్రియవక్తృత్వం = ఇంపుగాఁబలుకుట, ధీరత్వం = ధైర్యము. ఉచితజ్ఞతా = మంచిచెడ్డలెఱుంగు తెలివి (అను) చత్వారః = నాలుగైన,గుణాః = గుణములు,సహజాః = తనతోఁగూడనుబుట్టినవి. అభ్యాసేన = అలవాటుచేత, నలభ్యంతే = లభింపవు.

తా॥ ఈవి ఇంపుగాబలుకుట. ధైర్యము మంచిచెడ్డలెఱుంగుట. ఇవి తనతోపాటు పుట్టవలెనుగాని అభ్యసించినయెడల పట్టుబడవు.

శ్లో॥ అభుక్త్వామలకంపథ్యం భుక్త్వాతుబదరీఫలం।
కపిత్థంసర్వదాపథ్యం కదళీనకదాచన॥

టీ॥ అభుక్త్వా=భోజనముచేయక (పూర్వము) ఆమలకం=ఉసిరికకాయ; పథ్యం=పథ్యమైనది; భుక్త్వా=భోజనముచేసిన (పిమ్మట) బదరీఫలం=రేగుపండు; పథ్యం=పథ్యము; కపిత్థం=వెలగపండు; సర్వదా=భోజనముచేసినతర్వాతగాని పూర్వముగాని పథ్యము; కదళీ=అరటిపండు; కదాచన=ఎప్పుడును; పథ్యంన=పథ్యముకాదు.

తా॥ పరకడుపున నుసిరికాయ దినుటమంచిది. భోజనముచేసినపిమ్మట రేగుఁపండుదినుట మంచిది. వెలగపండు ఎప్పుడును మంచిదియే అరటి ఎప్పుడునుమంచిదికాదు.

శ్లో॥ శ్లోకార్థేనప్రవక్ష్యామి యదుక్తంగ్రంథకోటిభిః।
పరోపకారఃపుణ్యాయ పాపాయపరపీడనం।

టీ॥ గ్రంథకోటిభిః=అనేకగ్రంథములచే; యత్=ఏయ్యది; ఉక్తం=చెప్పబడినదో (దానిని) శ్లోకార్థేన=ఒకఅర్థశ్లోకముచే; ప్రవక్ష్యామి=చెప్పఁబోవుచున్నాను,పరోపకారః=ఇతరులకు చేయునుపకారము; పుణ్యాయ=పుణ్యముకొఱకు; పరపీడనం=ఇతరులనుపీడించుట; పాపాయ=పాపముకొఱకు.

తా॥ అనేకగ్రంథములచే చెప్పఁబడినవిషయములను నేనీయర్థశ్లోకమందు తేటఁదెల్లముగాచెప్పుచున్నాను.అదేమనిన పరులకుపకారముచేయుటపుణ్యముకొఱకును. పరులనుపీడించుటపాపముకొఱకును.

శ్లో॥ దుష్టాభార్యాశఠోమిత్రం భృత్యోఽహంకారసంయుతః।
నసర్పేచగృహేవాసో మృత్యురేవనసంశయః॥

టీ॥ భార్యా=పెండ్లాము; దుష్టా=చెడ్డది(ఐనయెడలను)మిత్రం=స్నేహితుఁడు; శఠః=కుత్సితుఁ(డైనయెడలను) భృత్యః=నౌకరు; అహంకారసంయుతః=అహంకారముగలిగినవాఁడైనను; ససర్పే=సర్పముతోఁగూడుకొనిన; గృహే=ఇంటియందు; వాసః=నివాసమైన; మృత్యురేవ=మరణమే; సంశయః=సందేహము; న=లేదు.

తా॥ గయ్యాళిపెండ్లాము, కుత్సితుఁడైన మిత్రుఁడు, అహంకారముగలిఁగిన నౌకరు సర్పముతోఁగూడిన గృహమందు వాసము; మనుష్యునకు నిస్సంశయముగా మరణావస్థను గల్గించును.

శ్లో॥ యస్మిన్ దేశేనసన్మానో నప్రీతిర్నచబాంధవాః।
నవిద్యానాస్తిధనికా నతత్రదివసంవసేత్॥

టీ॥ యస్మిన్=ఏ; దేశే=దేశమందు; సన్మానః=గౌరవము; నలేదో; ప్రీతిశ్చ=ఆదరణమున్ను; న=లేదో; బాంధవాశ్చ=బంధుగులను; న=లేరో; ధనికాః=ధనికులు;నైవ=లేరో; తత్ర=అచ్చట; దివసం=ఒక్కదినముగూడ; నవసేత్=నివసింపఁగూడదు.

తా॥ ఏదేశమందు సన్మానము, ఆదరణమును, బంధువులు, విద్యయు ధనికులును లేకుందురో అచ్చటనొక దినమైన వసింపఁగూడదు.

శ్లో॥ అగ్నిహోత్రఫలావేదా దత్తభుక్తఫలంధనం।
రతిపుత్రఫలాదారా శీలవృత్తఫలంశ్రుతం॥

టీ॥ వేదాః=వేదములు; అగ్నిహోత్రఫలాః=అగ్నికార్యములుచేయుటయేఫలముగాగలవి; ధనం=ద్రవ్యము; దత్తభుక్తఫలం=తినకున్నదానినను భవించుటయేఫలముగాగలది; దారాః=భార్య; రతిపుత్రఫలా=సంభోగముచేతపుత్రరూపమైన ఫలముగలది; శ్రుతం=శాస్త్రములు మొదలగునవివినుట; శీలవృత్తఫలం=స్వభావముయొక్కమంచిదనమే ప్రయోజనముగాగలది.

తా॥ వేదము చదివినందునకు అగ్నిహోత్రము చేయుట, ధనము గల్గినందునకు దానభోగములనుభవించుట, భార్యయున్నందునకు సంతానము పొందుట, శాస్త్రములున్నందునకు ఆచారవంతుఁడగుటయు సుఫలము.

శ్లో॥ స్వగృహే పూజ్యతే మూర్ఖః స్వగ్రామే పూజ్యతే ప్రభుః।
స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే॥

టీ॥ మూర్ఖః=మోటకుడు; స్వగృహే=తనయింటియందు; పూజ్యతే=పూజింపఁబడుచున్నాఁడు; ప్రభుః=ధనికుడు; స్వగ్రామే=తనగ్రామమందు; పూజ్యతే=పూజింపఁబడుచున్నాడు; రాజా=రాజు; స్వదేశే=తానురాజ్యము చేయు దేశమునందు; పూజ్యతే=పూజింపఁబడుచున్నాఁడు; విద్వాన్=పండితుఁడు; సర్వత్ర=అంతటను; పూజ్యతే=పూజింపఁబడుచున్నాఁడు.

తా॥ మూర్ఖుఁడు తనయింటియందును, ధనికుఁడు తనగ్రామమందును రాజు తానుపాలించు దేశమునను పూజింపఁబడునుగాని, పండితుఁడు అంతటనుఁ బూజింపఁబడును.

శ్లో॥ కుచేలినం దంతమలాపహారిణం బహ్వాశినం నిష్ఠురవాక్య
భాషిణం। సూర్యోదయే చాస్తమయే చ శాయినం
విముంచతి శ్రీరపి చక్రపాణినం॥

టీ॥ కుచేలినం=మలినవస్త్రములుగలవానిని; దంతమలాపహారిణం=పండ్లపాచిని పోఁగొట్టుకొననివాడు; బహ్వాశినం=తిండిపోతును; నిష్ఠురవాక్యభాషిణం=నిష్ఠురోక్తులుగలవానిని; సూర్యోదయే=ప్రొద్దుపొడుచునప్పుడును అస్తమయేచ=ప్రొద్దుగ్రుంకునప్పుడును; శాయినం=పండుకొనువానిని; శ్రీః=లక్ష్మి, చక్రపాణినమపి=కృష్ణమూర్తినైన; విముంచతి=వదలును.

తా॥ మలినవస్త్రము ధరించినవానిని, పండ్లుతోమనివానిని, తిండిపోతును, నిష్ఠురోక్తులుగలవానిని, ప్రాతస్సాయంకాలములయందు నిద్రించువానిని, ఇట్టిపురుషుని ఇతరగుణములచే కృష్ణసమానుఁడైనను వానినిలక్ష్మి పరిత్యజించును.

శ్లో॥ దీర్ఘశృంగమనడ్వాహం నిర్లజ్జాంవిధవాస్త్రియం।
శూద్రమక్షరసంయుక్తం దూరతఃపరివర్జయేత్॥

టీ॥ దీర్ఘ=పొడవైన, శృంగం=కొమ్ములుకలిగినట్టి, అనడ్వాహం=ఎద్దును, నిర్లజ్జాం=సిగ్గులేని, విధవాస్త్రియం=విధంతువును, అక్షరసంయుక్తం=చదువుగల, శూద్రం=శూద్రుని, దూరతః=దూరముగా, పరివర్జయేత్=విడువవలయును.

తా॥ నిడువుకొమ్ములుగల యెద్దును, సిగ్గులేనివిధవను, చదువుగలశూద్రుని, పరిత్యజింపవలెను.

శ్లో॥ ముఖంపద్మదళాకారం వచశ్చందనశీతలం।
హృత్కర్తరీసమంచాతి వినయంధూర్తలక్షణం॥

టీ॥ ముఖం=మొగము, పద్మదళాకారం=తామర రేకులవంటి యాకారముగలది, వచః=మాట, చందనశీతలం=గంధమువలె చల్లనైనది, హృత్=మనస్సు, కర్తరీసమం=కత్తెరతో సమానమైనది, అతివినయం=మిక్కిలివినయము, ధూర్తలక్షణం=ధూర్తునిలక్షణము.

తా॥ ముఖము చక్కగ పద్మమువలె మనోహరముగానుండును.మాటమంచిగంధమువలె మిక్కిలి చల్లగానుండును. హృదయముమాత్రము కత్తెరవలెనుండును. మిక్కిలివినయముగలిగి యుండును. ఇదిధూర్తుని లక్షణము.

శ్లో॥ మాతృహీనశిశుజీవనంవృథా కాంతహీననవయౌవనంవృథా
శాంతిహీనతపసఃఫలంవృథా తింత్రిణీరసవిహీనభోజనం॥

టీ॥ మాతృహీన=తల్లిలేని, శిశు=బాలకునియొక్క, జీవనం=బ్రదుకు వృథా=వ్యర్థము, కాంతహీన=భర్తలేని, నవయౌవనం=క్రొత్తజవ్వనము, వృథా=వ్యర్థము, శాంతిహీన=శాంతిలేని, తపసః=తపస్సుయొక్కఫలము, వృథా=వ్యర్థము, తంత్రిణీరసవిహీనభోజనం=పులుసులేని భోజనము, వృథా=వ్యర్థము.

తా॥ తల్లిలేని బిడ్డయును, ప్రియుడులేని ప్రాయమును, శాంతిలేని తపంబును, పులుసులేని భోజనమును వ్యర్థము.

శ్లో॥ వస్త్రముఖ్యస్త్వలంకారః ప్రియముఖ్యంతుభోజనం।
గుణోముఖ్యస్తునారీణాం విద్యాముఖ్యస్తుబ్రాహ్మణః॥

టీ॥ అలంకారః=అలంకారము, వస్త్రముఖ్యః=బట్టలేముఖ్యముగాగల ది, భోజనం=భోజనము, ప్రియముఖ్యం=ప్రియమయే ముఖ్యముగాగలవి, నారీణాం=స్త్రీలకు, ముఖ్యః= ప్రధానమైన,గుణః = గుణము,బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, విద్యాముఖ్యః = చదువేప్రధానముగాగలవాడు.

తా॥ అలంకారమునకు ముఖ్యము, వస్త్రము, భోజనమునకు ముఖ్యము ప్రేమ, స్త్రీలకు ముఖ్యముగుణము, బ్రాహ్మణునకు; విద్యయేముఖ్యము.

శ్లో॥ అమృతంసద్గుణాభార్యా అమృతంబాలభాషితం।
అమృతంరాజసమ్మాన మమృతంమానభోజనం॥

టీ॥ సద్గుణా = గుణవతియైన, భార్యా= పెండ్లాము; అమృతం = అమృతముతోసమానము, బాలభాషితం=బాలునియొక్కమాట, అమృతం= అమృతముతోసమానము, రాజసమ్మానం = రాజుయొద్ద గౌరవముపొందుట, అమృతం = అమృతముతో సమానమైనది, మానభోజనం = గౌరవముతో కూడుకొన్న భోజనము, అమృతం = అమృతముతో సమానమైనది.

తా॥ గుణవతియైనపెండ్లాము, బాలునిముద్దుమాటలు, రాజుయొద్దస మ్మానముపొందుట, మానయుక్తభోజనము,ఇవియమృతముతోసమానమైనవి.

శ్లో॥ దుర్వృత్తోవాసువృత్తోవా మూర్ఖఃపండితఏవవా।
కాషాయదండమాత్రేణ యతిఃపూజ్యోనసంశయః॥

టీ॥ దుర్వృత్తోవా= దుర్వ్యాపారముగలవాడుగాని,సువృత్తోవా = మంచివ్యాపారముగలవాఁడుగాని, మూర్ఖోవా = మూర్ఖుఁడేగాని, పండితఏవవా = పండితుఁడేగాని, కాషాయదండమాత్రేణ = కాషాయవస్త్రముసుధరించిన మాత్రమున, యతిః = సన్యాసి, పూజ్యః = పూజింపఁదగినవాఁడు, నసంశయః=సందేహములేదు.

తా॥ యతిదురాచారవంతుఁడుగాని, సదాచారవంతుఁడుగాని, మూ

ర్షుఁడుగాని, పండితుఁడుగాని; కాషాయదండములు ధరించుటచేత పూజింపఁదగినవాఁడు సందియమించుకేనియులేదు.

శ్లో॥ ఉపకారేణనీచానా మపకారోహిజాయతే।
పయఃపానంభుజంగానాం కేవలంవిషవర్ధనం॥

టీ॥ నీచానాం=చెడ్డవారికి; ఉపకారేణ=మేలుచేయుటచేత; అపకారః=కీడు; జాయతేహి=కలుగునుగదా; భుజంగానాం=సర్పములకు; పయఃపానం=పాలుద్రాగించుట; కేవలం=బొత్తిగా; విషవర్ధనం=విషమును వృద్ధిజేయుట.

తా॥ పాముసకుఁబాలుపోయుటచేత విషవృద్ధికలిగినట్లు నీచులకుపకారముసేయ నపకారమేసంభవించును.

శ్లో॥ ఋణంయాచ్నాచవృద్ధత్వం జారచోరదరిద్రతాః
రోగశ్చభుక్తశేషశ్చ హ్యష్టకష్టాఃప్రకీర్తితాః॥

టీ॥ ఋణం=అప్పుకలిగియుండుట; యాచ్ఞా=ఒకనినియాచించుట; వృద్ధత్వం=ముదుసలితనము; జారచోరదరిద్రతాః=జారత్వము, చోరత్వము దారిద్ర్యము; రోగశ్చ=రోగములున్ను; భుక్తశేషశ్చ=ఒకరు తినుభోజనము చేసిపోగానప్పుడు భోజనముచేయుట; (ఇవి) అష్టకష్టాః=ఎనిమిదికష్టములని ప్రకీర్తితాః=చెప్పఁబడినవి.

తా॥ ఋణము, యాచించుట, ముదిమి, వ్యభిచారము, దొంగతనము, బీదతనము, వ్యాధి, భుక్తశేషభోజనము, ఇవిఅష్టకష్టములు.

శ్లో॥ దాసీభృత్యాస్సుతోబంధు ర్వస్తువాహనమేవచ।
ధనధాన్యసమృద్ధిశ్చ హ్యష్టభోగాఃప్రకీర్తితాః॥

టీ॥ దాసీ=తొత్తు భృత్యాః=నౌకరులు సుతః=కుమారుఁడు బంధుః=బందుగు; వస్తు=వస్తువులు; వాహనమేవ=వాహనములు; ధనధాన్యసమృద్ధిశ్చ=ధనముయొక్క ధాన్యముయొక్కసమృద్ధి (ఇవి) అష్టభోగాః=ఎనిమిదిభోగములు (అని) ప్రకీర్తితాః=చెప్పఁబడుచున్నవి.

తా॥ దాసీజనులు, భటులు, కుమారులు, చుట్టములు, పదార్థములు, వాహనములు, ధనము, ధాన్యము, ఇవిఅష్టభోగములు.

శ్లో॥ మక్షికామరుతో వేశ్యా యాచకో మూషక స్తథా।
గ్రామణీర్గణకశ్చైవ సప్తైతే పరబాధకాః॥

టీ॥ మక్షికాః = ఈగలు, మరుతః = వాయువులు, వేశ్యాః = భోమువాండ్రు, యాచకః = యాచకుఁడు, మూషకః = ఎలుక, గ్రామణీః = గ్రామాధికారి, గణకశ్చ = కరణమున్ను, ఏతే = ఈ, సప్త = ఏడుగురును, పరబాధకాః = పరులను బాధించువారు.

తా॥ ఈగలు, గాలి, భోగముది, యాచకుడు, ఎలుక, గ్రామాధికారి, కరణము, వీరలేడుగురెల్లప్పుడు పరులను పీడించువారు.

శ్లో॥ భూప్రదక్షిణషట్కేన కాశీయాత్రాయుతేనచ।
సేతుస్నానశతైర్యశ్చ తత్ఫలంమాతృవందనే॥

టీ॥ భూప్రదక్షిణషట్కేన = ఆరుమారులు, భూప్రదక్షిణము చేయుటచేతను, కాశీయాత్రాయుతేనచ = పదివేలమారులు కాశీయాత్ర చేయుటచేతను, సేతుస్నానశతైశ్చ = అనేకపర్యాయములు సేతుస్నానము చేయుటచేతను, యత్ = ఏఫలము (గల్గునో) తత్ = ఆ, ఫలం = ఫలము, మాతృవందనే = తల్లినమస్కారమందు (గలుగును)

తా॥ ఆరుమారులు భూప్రదక్షిణము చేయుటచేతను, పదివేలమారులు గంగాస్నానముచేయుటచేతను, అనేకపర్యాయములు సేతుస్నానముచేయుటచేతను, యేఫలముకల్గునో అంతఫలము తల్లికి ప్రీతిపూర్వకముగా నమస్కరించిన లభించును.

శ్లో॥ నాన్నోదకసమందానం నద్వాదశ్యాఃపరంవ్రతం।
నగాయత్ర్యాఃపరంమంత్రం నమాతుర్దైవతంపరం॥

టీ॥ అన్నోదకసమం = అన్నదానముతోను ఉదకదానముతోసమానమైన దానం = దానము, న = లేదు, ద్వాదశ్యాః = ద్వాదశీవ్రతముకంటె, పరం = ఉత్కృష్టమైనవ్రతం = వ్రతము, న = లేదు గాయత్ర్యాః =

గాయత్రికంటె, పరం = శ్రేష్ఠమైన మంత్రం = మంత్రము, న = లేదు, మాతుః = తల్లికంటె, పరం = ఉత్కృష్టమైన; దైవతం = దైవతం; న = లేదు.

తా॥ అన్నోదకదానములతో సమానమగుదానములేదు, ద్వాదశీవ్రతముకంటె మంచిదైనవ్రతములేదు, గాయత్రీమంత్రమునకంటె నుత్కృష్టమైన మంత్రమును తల్లికంటె శ్రేష్ఠమైన దైవమును లేదు.

శ్లో॥ రాజవత్పుత్రదారాశ్చ స్వామివన్మిత్రబాంధవాః।
ఆచార్యవత్సభామధ్యే భాగ్యవంతంస్తువంతిహి।

టీ॥ పుత్రదారాశ్చ=కొడుకులు పెండ్లామున్ను; రాజవత్=రాజువలెను; మిత్రబాంధవాః=మిత్రులు బంధువులున్ను; స్వామివత్=దేవునివలెను; సభామధ్యే=సభామధ్యమందు; ఆచార్యవత్=గురువువలెను; భాగ్యవంతం=భాగ్యముగలవానిని; స్తువంతిహి=పొగడుదురుగదా

తా। లోకమునందు భాగ్యవంతుడైనవానిని భార్యాపుత్రులు రాజువలెచూతురు. స్నేహితులు చుట్టములు దేవునివలెను భావింతురు సభామధ్యమందు నాచార్యునివలె నెంచుదురు కాన భాగ్యవంతుడే గొప్పవాడు

శ్లో। కపిలాక్షీరపానేన బ్రాహ్మణీసంగమేనచ।
వేదాక్షరవిచారేణ శూద్రశ్చండాలతాంవ్రజేత్॥

టీ। శూద్రః=శూద్రుడు; కపిలాక్షీరపానేన=కపిలవర్ణముగల గోవుయొక్కపాలు త్రాగుటచేతను; బ్రాహ్మణీసంగమేన=బ్రాహ్మణస్త్రీని సంభోగించుటచేత; వేదాక్షరవిచారేణ=వేదాక్షరవిచారము చేతను; చండాలతాం=చండాలత్వమును; వ్రజేత్=పొందును

తా॥ జగంబున శూద్రుడు కపిలవర్ణముగల గోవు పాలు త్రాగుటచేతను బ్రాహ్మణస్త్రీ సంగముచేతను వేదాక్షరవిచారణచేతను చండాలత్వమును బొందును.

శ్లో॥ బాలసఖిత్వమకారణహాస్యం స్త్రీషువివాదమసజ్జనసేవా। గార్దభయానమసంస్కృతవాణీషట్సునరోలఘుతాముపయాతి॥

టీ॥ బాలసఖిత్వం=పిల్లలతోడిచెలిమి; అకారణహాస్యం=కారణములే కనవ్వుట; స్త్రీషు=ఆడువాండ్రయందు; వివాదం=వాదులాడుట; అసజ్జన=చెడ్డవారలయొక్క; సేవా=కొలువు; గార్దభయానం=గాడిదె నెక్కుట; అసంస్కృతవాణీ=సంస్కృతవాక్కులేకపోవుట; షట్సు=ఈయారింటియందును; నరః=నరుడు; లఘుతాం = లఘుత్వము; ఉపయాతి=పొందుచున్నాడు

తా॥ పిల్లలతో చెలిమిచేయుట, కారణములేనినగవు, స్త్రీలతో వాదులాడుట, దుర్జనునియొద్దకొలువుండుట, గాడిదె నెక్కుట, సంస్కృతభాషను దెలియకుండుట ఈయారింటిచే మనుష్యులు లాఘవము చెందుదురు.

శ్లో॥ లోకయాత్రాభయంలజ్జా దాక్షిణ్యంధర్మశీలతా।
పంచయస్మిన్నవిద్యంతే నకుర్యాత్తేనసంగమం॥

టీ॥ లోకయాత్రా = లోకవ్యవహారము; భయం = వెఱపు; లజ్జా= సిగ్గు; దాక్షిణ్యం= నేర్పు; ధర్మశీలతా = ధర్మస్వభావత్వము; పంచ = ఈ ఐదును; యస్మిన్ = ఎవనియందు; నవిద్యంతే = ఉండవో; తేన=వానితో సంగమం = సంభోగము; నకుర్యాత్ = చేయఁగూడదు.

తా॥ లోకవ్యవహారము, వెఱపు, సిగ్గు, దాక్షిణ్యము, ధర్మస్వభావము, ఈ ఐదుగుణమ్ములెవనికిలేవో వానితో స్నేహము చేయగూడదు.

శ్లో॥ విద్వానేవవిజానాతి విద్వజ్జనపరిశ్రమం।
నహివంధ్యావిజానాతి గుర్వీంప్రసవవేదనామ్।

టీ॥ విద్వానేవ = పండితుఁడే; విద్వజ్జనపరిశ్రమం = పండితసమూదాయముయొక్క పరిశ్రమమును; విజానాతి = తెలుసుకొనుచున్నాడు; వంధ్యా = గొడ్రాలు; గుర్వీం = గొప్పదియగు; ప్రసవవేదనాం = చూలాలిప్రసవవేదనను; నవిజానాతి = తెలుసుకొనలేదుగదా.

తా॥ లోకమునందు గొడ్రాలు సహింపరాని ప్రసవవేదన నెటు లెరుగదో యారీతిగా విద్యావిహీనులు విద్వాంసులపరిశ్రమము నెఱుఁగలేరు.

శ్లో॥ విద్యాశ్చతస్రోసాధ్యాస్సు జన్మనానహిసంభవాః।
గాంధర్వంచకవిత్వంచశూరత్వందానశీలతా॥

టీ॥ గాంధర్వం = సంగీతము; కవిత్వంచ = కవిత్వము; శూరత్వం = శౌర్యము; దానశీలతా = దానస్వభావము (ఈ) చత్వారః = నాలుగు; విద్యాః = విద్యలును; జన్మనా = పుట్టుతోనే; సంభవాః = పుట్టినవి; నసాధ్యాః స్యుః = సాధింపదగినవి కావు.

తా॥ జనులకు సంగీతము, కవిత్వము, శౌర్యము, దానస్వభావము, ఈ నాలుగు విద్యలును తనతో పుట్టవలెనుగాని సాధింపఁగరావు.

శ్లో॥ మాతానిందతినాభినందతిపితాభ్రాతానసంభాషతే।
భృత్యఃకుప్యతినానుగచ్ఛతి సుతఃకాంతాచనాలింగతే।
అర్థప్రార్థనశంకయానకురుతే సంతాపమాత్రంసుహృ।
త్తస్మాదర్థముపార్జయశ్రుణుసఖేహ్యర్థేనసర్వేవశాః॥

టీ॥ మాతా = తల్లి; నిందతి = తిట్టును, పితా = తండ్రి, నాభినందతి = ఆనందింపఁడు; భ్రాతా = అన్న; నసంభాషతే = మాట్లాడఁడు; భృత్యః = నౌకరు; కుప్యతి = కోపగించుకొనును; సుతః = కొడుకు; నానుగచ్ఛతి = వెన్వెంటరాఁడు; కాంతాచ = భార్యయు; నాలింగతి = కౌగలింపదు; సుహృత్ = స్నేహితుడు; అర్థప్రార్థనశంకయా = తన్నుధనముయాచించు ననుశంకచేత, సల్లాపమాత్రంనకురుతే = మాటైననుమాటాడడు; తస్మాత్ = అందువలన, అర్థం = ద్రవ్యమును, ఉపార్జయ = గడింపుము, అర్థేన = ద్రవ్యముచేత, సర్వే = అందరును, వశాః = వశులగుదురు, శ్రుణు = వినుము.

తా॥ దరిద్రుఁడైనవానిని తల్లినిందించును, తండ్రి సంతోషింపడు, అన్నదమ్ములు మాటలాడరు, పనివాఁడు కోపగించుకొనును, కొడుకు వెంటరాడు, పెండ్లాము కౌగిలింపదు, తనను ప్రవ్యమడుగుననుశంకచేత స్నేహితుఁడు పలుకరింపఁడు, కాబట్టి ఓమిత్రుఁడా! ధనముచేతనందరువశులగుదురు, గాన ధనమార్జింపవలెను.

శ్లో॥ గోమూత్రమాత్రేణపయోవినష్టం తక్రస్యగోమూత్రశతేనకింవా। అత్యల్పపాపైర్విపదశ్శుచీనాం
పాపాత్మనాంపాపశతేనకింవా॥

టీ॥ పయః = పాలు, గోమూత్రమాత్రేణ = కొంచెము గోమూత్రముచేతనే, వినష్టం = చెడిపోవును, తక్రస్య = మజ్జిగకు, గోమూత్రశతేన = ఎక్కువగోమూత్రముచే, కింవా = ఏమినష్టము, శుచీనాం = సత్పురుషులకు అత్యల్పపాపైః = కొంచెపుపాపములచేతనే, విపదః = ఆపత్తులు (సంభవించును) పాపాత్మనాం = పాపాత్ములకు, పాపశతేన = అనేకపాపములచేత కింవా = ఏమి

తా॥ గోమూత్రము కొంచెముపడుటచేతనే పాలుచెడిపోవును, గోమూత్రమెంతకలిసినను మజ్జిగకు చెఱుపులేదు, అలాగేపరిశుద్ధులైన సత్పురుషులకు అల్పపాపంబుచేతనే విపత్తిగలుగును, పాపాత్ములకధిక పాపంబుచేసినను వెరపుకలుగదు.

శ్లో॥ సముద్రమంథనేలేభే హరిర్లక్ష్మీంహరోవిషం।
భాగ్యంఫలతిసర్వత్ర నవిద్యానచపౌరుషం॥

టీ॥ సముద్రమంథనే = సముద్రమును తరచునప్పుడు, హరిః = విష్ణువు, లక్ష్మీం = లక్ష్మీదేవిని, లేభే = పొందును, హరః = ఈశ్వరుఁడు, విషం = విషమును, లేభే = పొందెను, సర్వత్ర = అంతటను, భాగ్యం = అదృష్టము, ఫలతి = ఫలించును, విద్యా = విద్య, న = అట్లుగాదు, పౌరుషం = మగఁటిమి, న = అట్లగాదు.

తా॥ సముద్రమును తరచునప్పుడు, విష్ణువు లక్ష్మీదేవినిపొందెను, శివుడు విషమునుపొందెను, కాబట్టి వారివారి యదృష్టనుసారముగా ఫలంబుగలుగును.

శ్లో॥ ఆతురేనియమోనాస్తి బాలేవృద్ధేతథైవచ।
సదాచారరతేచైవ హ్యేషధర్మస్సనాతనః॥

టీ॥ ఆతురే=రోగివిషయమై; బాలే=బాలునివిషయమై; వృద్ధే=ముదుసలివిషయమై; తథైవ=అట్లనే; సదాచారరతేచైవ=సదాచారాసక్తుని విషయమైనియమః=నియతపూర్వకమైనవ్రతము; నాస్తి=లేదు; ఏషః=ఇది; సనాతనః=ప్రాచీనమైన; ధర్మః=ధర్మము.

తా॥ రోగికిని, బాలునికి, వృద్ధునకును, సదాచారాసక్తునకును నియమ పూర్వక వ్రతములేదు. ఇది సనాతనధర్మము.

శ్లో॥ ఏకోదేవః కేశవోవాశివోవా ఏకోవాసఃపత్తనంవావనంవా।
ఏకోమిత్రంభూపతిర్వాయతిర్వా ఏకానారీసుందరీవాదరీవా॥

టీ॥ కేశవోవా=విష్ణువైనను; శివోవా=శివుఁడైనను;ఏకః=ఒక్కండు; దేవః=దేవుఁడు; పత్తనంవా= పట్టణమైనను; వనంవా = వనమైనను; ఏకః = ఒక్కటియే; వాసః = నివాసము; భూపతిర్వా = రాజైనను; యతిర్వా = సన్యాసియైనను; ఏకః = ఒక్కఁడుఁ; మిత్రం = స్నేహితుఁడు;సుందరీవా = సౌందర్యవతియైన; నారీవా = భార్యగాని; దరీవా = గుహగాని; ఏకా = ఒక్కటి (ఆశ్రయణీయం = ఆశ్రయింపఁదగినది.)

తా॥ విష్ణువైనను, శివుఁడైనను, నొక్కదేవుని నమ్మవలయును. పత్తనమందుగాని, వనమందుగాని, నివాసముచేయనలయును. రాజుతోనైనను, సన్యాసితోనైనను స్నేహము చేయనలయును. సౌందర్యవతియైనభార్యతో గూడియుండవలెను లేదా గుహలోయుండి తపంబుచేసికొననలయును.

శ్లో॥ అజాయుద్ధేఋషిశ్రాద్ధే ప్రభాతేమేఘడంబరే।
దంపత్యోఃకలహేచైవ బహ్వారంభోలఘుక్రియా।

టీ॥ అజాయుద్ధే= మేకపోతులయుద్ధమందును; ఋషిశ్రాద్ధే= ఋషులశ్రాద్ధదినమందును; మేఘడంబరే=మేఘాడంబరముగలిగిన, ప్రభాతే=ప్రొద్దుటపూట; దంపత్యోః= దంపతులయొక్క; కలహేచైవ= కలహమందున్ను;బహ్వారంభః = గొప్పదియగుఆరంభము; లఘుక్రియా = క్రియస్వల్పము.

తా॥ మేకపోతుల యుద్ధమందును, ఋషిశ్రాద్ధమందును, ప్రాతఃకాలమేఘాడంబరమందును,దంపతులకలహమందును వీటియందారంభమధికంబును క్రియస్వల్పంబునగును.

శ్లో॥ హతమశ్రోత్రియేదానం హతంసైన్యమనాయకం।
హతారూపవతీవంధ్యా హతోయజ్ఞస్త్వదక్షిణః॥

టీ॥ అశ్రోత్రియే = వేదాధ్యయన హీనునియందు, దానం = దానము, హతం = నిష్ప్రయోజనము, అనాయకం = ప్రభువులేని, సైన్యం = సైన్యము, హతం = నిష్ప్రయోజనము, రూపవతీ = మంచిరూపముగలగిన, వంధ్యా = గొడ్రాలు, హతా = నిష్ప్రయోజనము, అదక్షిణః = దక్షిణలేని, యజ్ఞః = యజ్ఞము, హతః = నిష్ప్రయోజనము.

తా॥ వేదాధ్యయనహీనునకిచ్చినదానము, నాయకుడులేనిసైన్యము, సౌందర్యవతియైన గొడ్రాలు, దక్షిణలేనియజ్ఞంబును ఇవినిష్ప్రయోజనములు.

శ్లో॥ క్రోధోవై వస్వతోరాజా ఆశావై తరణీనదీ।
విద్యాకామదుఘాధేను స్సంతోషోనందనంవనం॥

టీ॥ క్రోధః = కోపమే, వైవస్వతోరాజా = యమధర్మరాజు, ఆశా = ఆశయే। వైతరణీనదీ = వైతరణీనది, (తోసమానము) విద్యా = చదువు, కామదుఘా = కోరికలనునిచ్చు, ధేనుః = కామధేనువు, సంతోషః = సంతోషమే, నందనంవనం = నందనవనము(తోసమానము)

తా॥ కోపంబు యమునితోసమానమైనది, ఆశవైతరణీనదితోసమానమైనది, విద్యకామధేనువుతోసమానమైనది, సంతోషము నందనవనముతో సమము

శ్లో॥ అసారంఖలుసంసారం సారంశ్వశురమందిరం।
హిమాలయేహరశ్శేతే హరిశ్శేతేమహోదధౌ॥

టీ॥ సంసారం = సంసారము (పెండ్లాము పుత్రులు మొ,) అసారం ఖలు = సారములేనిదిగదా (ఐనను) శ్వశురమందిరం = మామగారిల్లు సారం = సారమైనది, హరః = ఈశ్వరుడు, హిమాలయే = హిమవత్పర్వతమందు, శేతే = పండుకొనుచున్నాడు, హరిః = విష్ణువు, మహోదధౌ = మహాసముద్రమందు, శేతే = పండుకొనుచున్నాడు.

తా॥ సంసారము, సారములేనిదైనను, మామగారిల్లు, సారముగలది, గనుకనే శివుడు, హిమత్పర్వతమందును, విష్ణువు సముద్రమందును, శయనించిరి.

శ్లో॥ చితాచింతాద్వయోర్మధ్యే చింతానామగరీయసీ।
చితాదహతినిర్జీవం చింతాప్రాణయుతంవపుః॥

టీ॥ చితాచింతాద్వయోః = సావచింతలను నీరెంటియొక్క, మధ్యే = మధ్యమందును, చింతానామ = చింతయనునదియే, గరీయసీ = గొప్పది, చితా = సావ నిర్జీవం = ప్రాణములేనివానిని, దహతి = కాల్చును, చింతా = దుఖము, ప్రాణయుతం = ప్రాణముతో గూడుకొనిన, వపుః = శరీరమును, దహతి = కాల్చును.

తా॥ సావయనగా చచ్చిపోయినవానినికాల్చు చితి ఈచితి చింతలలో చితియేయుత్తమము. ఈచితి ప్రాణములేని వానిని మాత్రమేకాల్చును ఈదుఃఖము ప్రాణములతోనున్నవానినే కాల్చునుకాన చింతకూడదు.

శ్లో॥ ఆగచ్ఛేచ్ఛ్రుయదాలక్ష్మీ ర్నారికేళఫలాంబువత్।
నిర్గచ్ఛేచ్ఛ్రుయదాలక్ష్మీ గజభుక్తకపిత్థవత్॥

టీ॥ లక్ష్మీః = సంపద; నారికేళఫలాంబువత్ = టెంకాయలోని నీరువలె; యథా = ఏప్రకారముగా (అనఁగా తెలియఁబడకుండా) ఆగచ్ఛేత్ = వచ్చునో; తథా = ఆప్రకారముగా (తెలియఁబడకుండా) గజభుక్త కపిత్థవత్ = ఏనుఁగుతినిన వెలగపండువలెను; నిర్గచ్ఛేత్ = నిర్గమించును.

తా॥ సంపదవచ్చునప్పుడు తెలియఁబడకుండ టెంకాయలోని నీరువలెను తనంతటతానే వచ్చును. పోవునపుడు ఏనుగుతిన్న వెలగపండువలె తెలియబడకుండపోవును.

శ్లో॥ నేక్షేతోద్యంతమాదిత్యం నాస్తంయాంతంకదాచన।
నోపసృష్టంనవారిస్థం నమధ్యంనభసోగతం॥

టీ॥ ఉద్యంతం = ఉదయించుచున్నట్టియు; అస్తంయాంతం = అస్తమించుచున్నట్టియు; ఉపసృష్టం = తీక్ష్ణముగావెల్గుచున్నట్టియు; వారిస్థం = ఉదకమందున్నట్టియు; నభసః = ఆకసముయొక్క; మధ్యం = నడుమను; గతం = పొందినట్టియు; ఆదిత్యం = సూర్యుని; నేక్షేత = చూడఁగూడదు.

తా॥ సూర్యుఁడుదయించు చున్నపుడును అస్తమయమగునప్పుడును

ఆకాశమధ్యమందున్నప్పుడును తీక్ష్ణముగానున్నపుడును ఉదకములో సూర్య ప్రతిబింబమును చూడగూడదు.

శ్లో॥ నలంఘయేద్వత్సతంత్రీం నప్రధావేచ్చవర్షతి।
నచోదకేనిరీక్షేతస్వంరూపమితిధారణా॥

టీ॥ వత్స = దూడయొక్క; తంత్రీం = పలుపును; నలంఘయేత్ = దాటరాదు, వర్షతి = వర్షించుచుండఁగా, నప్రధావేచ్చ = పరుగిడరాదు, ఉదకే = ఉదకమున, స్వం = తనదైన, రూపం = ఆకారము, నిరీక్షేత = చూడగూడదు, ఇతిధారణా = నిశ్చయము.

తా॥ దూడపలుపుదాటగూడదు, వానకురియుచుండగా పరుగిడరాదు, నీటియందుతననీడను జూచుకొనరాదు.

శ్లో॥ నాశ్నీయాద్భార్యయాసార్ధం నైనామీక్షేతచాశ్నతీం।
క్షువంతీంజృంభమాణాంవా నచాసీనాంయథాసుఖం।
నాంజయంతీంస్వకేనేత్రే నచాభ్యక్తామనావృతాం।
నపశ్యేత్ప్రసవంతీంచ తేజస్కామోద్విజోత్తమః॥

టీ॥ భార్యయా సార్ధం = భార్యతోగూడ, నాశ్నీయాత్ = భుజింపరాదు, అశ్నతీం = భోజనముచేయుచున్నదానిని, క్షువంతీం = తుమ్ముచున్నదానిని, జృంభమాణాం = ఆవలించుచున్నదానినిగాని, యథాసుఖం = యథాసుఖముగా, ఆసీనాం = కూర్చున్నదానిని, స్వకే = తనదైన, నేత్రే = కంటియందు, అంజయంతీం = కాటుకపెట్టుచున్నదానిని, అభ్యక్తాం = తలంటిపోసికొనుదానిని, అనావృతాం = దిగంబరమైనదానిని, ప్రసవంతీంచ = నీళ్లాడుచున్నదానిని, ఏనాం = ఈభార్యను, నేక్షేత = చూడగూడదు.

తా॥ భార్యతోగూడ భోజనముచేయగూడదు, భార్యభోజనముచేయుచుండఁగా, తుమ్ముచుండగా, ఆవలించుచుండగా, యథాసుఖముగా కూర్చుండియుండగా, తలంటిపోసికొనుచుండగా, దిగంబరయైయుండగా, ప్రసవించుచుండగా, ఈ సమయములయందు శ్రేయస్కాముండగు బ్రాహ్మణుడు చూడగూడదు.

శ్లో॥ నాన్నమద్యాదేకవాసా ననగ్నస్స్నానమాచరేత్।

టీ॥ ఏకవాసాః = ఒక్కబట్టకలిగినవాఁడై, అన్నం = అన్నము, నాద్యాత్ = తినఁగూడదు, నగ్నః = దిగంబరుఁడై, స్నానం = స్నానమును, నాచరేత్ = చేయఁగూడదు.

తా॥ ఒంటివస్త్రముతో భుజింపరాదు, దిగంబరుఁడై స్నానము చేయరాదు.

సమూత్రంపథికుర్వీత నభస్మనినగోవ్రజే॥

శ్లో॥ నఫాలకృష్టేనజలేనచిత్యాంనచపర్వతే।
నజీర్ణదేవాయతనేనవల్మీకేకదాచన॥

శ్లో॥ ససత్త్వేషుగర్తేషు నగచ్ఛన్నాపిచస్థితః।
ననదీతీరమాసాద్య నచపర్వతమస్తకే॥

శ్లో॥ వాయ్వగ్నివిప్రానాదిత్య మపఃపశ్యంస్తథైవగాః।
నకదాచనకుర్వీత విణ్మూత్రస్యవిసర్జనం॥

టీ॥ పథి = (నల్గురునడచు)మార్గమందును; భస్మని = బూడిదయందు; గోవ్రజే = ఆవులమందలో; ఫాలకృష్టే = దున్నిననేలయందు; జలే = ఉదకమందు; చిత్యాం = చితియందు; పర్వతే = పర్వతమందు; జీర్ణదేవాయతనే = శిథిలమైనదేవాలయమునందు; వల్మీకే = పుట్టయందు; ససత్త్వేషు = జంతువులతోఁగూడికొనిన; గర్తేషు = పల్లములయందు; గచ్ఛన్ = వెళ్లుచున్నవాఁడైగాని; స్థితోఽపి = నిలబడియున్నవాఁడుగాని; మూత్రం = మూత్రమును; నకుర్వీత = చేయఁగూడదు నదీతీరం = నదియొడ్డున, ఆసాద్య = కూర్చుండి (గాని) పర్వతమస్తకే = పర్వతమందుగాని; వాయ్వగ్నివిప్రాన్ = వాయువు, అగ్ని, బ్రాహ్మణులు, ఆదిత్య = సూర్యుని, అపః = ఉదకమును, గాః = గోవులను, పశ్యన్ = చూచుచున్నవాఁడై, కదాచన = ఒకప్పుడును, విణ్మూత్రస్య = విణ్మూత్రములయొక్క, విసర్జనం = విడుచుటకు, నకుర్వీత = చేయఁగూడదు.

తా॥ ద్రోవ, బూడిదె, ఆలమంద, దున్నిననేల, నీరు, పాద, శ్రాం దశిధిలమైనదేవాలయము, పుట్ట,జంతువులతో గూడిన, పల్లము, వీనియందును నడచుచుగాని, నిలిచిగాని, నదీతీరమును, పర్వతశిఖరమందును, విణ్మూత్రంబుల విడువరాదు, మరియు వాయ్వగ్ని బ్రాహ్మణులను సూర్యుని ఉదకము ను గోవులను వీనినిజూచుచు విణ్మూత్రంబులువిడువరాదు.

శ్లో॥ మూత్రోచ్చారసముత్సర్గందివాకుర్యాదుదఙ్ముఖః।
దక్షిణాభిముఖోరాత్రౌ సంధ్యయోశ్చయథాదివా॥
శ్లో॥ ఛాయాయామంధకారేవా రాత్రౌవాహానిద్విజః।
యథాసుఖముఖఃకుర్యాత్ప్రాణబాధాభయేషుచ॥

టీ॥ దివా=పగటిపూట,మూత్రోచ్చారసముత్సర్గం=విణ్మూత్రవిసర్జనము,ఉదఙ్ముఖః=ఉత్తరాభిముఖుఁడైయును,రాత్రౌ=రాత్రిపూట,దక్షిణాభిముఖః=దక్షిణాభిముఖుఁడయ్యు,సంధ్యయోః=సంధ్యాకాలములందు, దివాయథా=పగటిపూట యెట్లులో (అట్లనే) కుర్యాత్=చేయవలయును,ఛాయాయాం=నీడయందుగాని, అంధకారేవా=చీఁకటిలోగాని, రాత్రౌవా=రేయిగాని, అహని వా=పగటిపూఁటగాని, ద్విజః = బ్రాహ్మణుఁడు, ప్రాణబాధాభయేషు= ప్రాణబాధభయములందు, యథాసుఖముఖః=తనకిష్టమైనదిక్కున, ముఖముగలవాఁడై, కుర్యాత్ = చేయవచ్చును,

తా॥ పగటియందు సంధ్యాకాలములయందు, ఉత్తరాభిముఖుఁడయ్యును, రాత్రియందు, దక్షిణాభిముఖుఁడయ్యును, విణ్మూత్రములను విడువవలయును, నీడయందు, అంధకారమందు, ప్రాణబాధాభయంబునందు దివారాత్రులలో నెప్పుడైన, ఏదిక్కునన్నైన నూర్చుండి విణ్మూత్రంబులు విడువవచ్చును.

శ్లో॥ నాగ్నింముఖేనోపధమేన్నగ్నాంనేక్షేతచస్త్రియం।
నామేధ్యంప్రక్షిపేదగ్నౌనచపాదౌప్రతాపయేత్॥

టీ॥ అగ్నిం= నిప్పును, ముఖేన= నోటిచేత, నోపధమేత్ = ఊదరాదు, నగ్నాం= దిగంబరయైన, స్త్రియం= స్త్రీని, నేక్షేత= చూడగూ

డదు, అగ్నౌ = నిప్పునందు, అమేధ్యం = అపవిత్రవస్తువు, నప్రక్షిపేత్ = ఉంచకూడదు, పాదే = కాళ్ళను, నప్రతాపయేత్ = తాపింపజేయకూడదు.

తా॥ అగ్నిని నోటితో నూదరాదు, దిసమొలతో నున్న స్త్రీని జూడరాదు, అపరిశుద్ధమయిన వస్తువును అగ్నియందువేయరాదు, అడుగులను కాచుకొనగూడదు.

శ్లో॥ నైకస్స్వప్యాచ్ఛూన్యగేహే శయానంనప్రబోధయేత్।
నోదక్యయాభిభాషేత యజ్ఞంగచ్ఛేన్నచాహ్వతః॥

టీ॥ శూన్యగేహే=ఎవ్వరులేనియింటియందు, ఏకః = ఒంటరిగా, నస్వప్యాత్ = పరుండరాదు. శయానం = నిద్రించుచున్నవానిని, నప్రబోధయేత్ = లేపరాదు, ఉదక్యయా = రజస్వలయైయున్నస్త్రీతో, నాభిభాషేత=మాటలాడరాదు, నాహ్వతోపి = పిలువబడనవాడై, యజ్ఞం = యజ్ఞమును, వ్రజేత్ = వెళ్ళవలెను.

తా॥ శూన్యగృహమందొక్కఁడును, నిద్రింపరాదు, నిద్రించువానిని లేపకూడదు, రజస్వలయైయున్న స్త్రీతో మాటలాడరాదు. పిలువకనే యజ్ఞమునమునకు బోవలెను.

శ్లో॥ నాధార్మికేవసేద్గ్రామే నవ్యాధిబహులేభృశం।
నైకఃప్రపద్యేధ్వానంచ నచిరంపర్వతేవసేత్॥

టీ॥ అధార్మికే = ధార్మికులులేనట్టి, వ్యాధిబహులే = అనేకవ్యాధులుకలిగినట్టియు గ్రామే = గ్రామమునందు, ననివసేత్ = నివసింపరాదు, ఏకః = ఒక్కఁడే, అధ్వానం = మార్గమును, నప్రపద్యేత = వెళ్ళకూడదు, చిరం = చాలకాలము, పర్వతే = కొండయందు, నవసేత్ = వసింపరాదు.

ధార్మికులులేని యూరియందును, మిగులవ్యాధి బహుళమయిన గ్రామమందును, నివసింపరాదు ఒంటరిగాఁద్రోవనడువరాదు, కొండయందు చిరకాలము నివసింపరాదు.

శ్లో॥ ఉపానహౌచవాసశ్చ ధృతమన్యైర్నధారయేత్।
ఉపవీతమలంకారం స్రజంకరకమేవచ॥

టీ॥ అన్యైః=ఇతరులచే, (ధృతా=ధరింపబడిన) ఉపానహౌ=చెప్పులు

ధృతం=ధరింపఁబడిన, ఉపవీతం=జందెము, అలంకారం=నగ, స్రజం=పూలదండ, కరకమేవ= కమండలము, నధారయేత్ = ధరింపరాదు.

తా॥ ఒకనిచేతధరింపఁబడిన పాపరక్షలు, వస్త్రము, యజ్ఞోపవీతము అలంకారము, పూలదండ, కమండలము వీనిని మఱియొకఁడుఁ ధరింపరాదు.

శ్లో॥ నావినీతై ర్వ్రజేద్ధుర్యైర్నచక్షుర్వ్యాధిపీడితైః।
సభిన్నశృంగాక్షిఖురైర్నవాలవిధిరూపితై

శ్లో॥ వినీతైస్తువ్రజేన్నిత్య మాశుగైర్లక్షణాన్వితైః।
వరరూపోపసంపన్నైః ప్రతోదేనాతుదన్భృశం॥

టీ॥ అవినీతైః = అశిక్షితములైనట్టియు, చక్షుర్వ్యాధిపీడితైః = నేత్రరోగముచే పీడింపఁబడుచున్నట్టియు, భిన్నశృంగాక్షిఖురైః = విరిగిన కొమ్ములు కన్నులు గొరిసెలు గలిగినట్టియు, నవాలవిధిరూపితైః = కోయఁబడినతోక గలిగినట్టియు, ధుర్యైః = వాహనములచేత (మీఁద) నవ్రజేత్ = పోఁగూడదు, నిత్యం = ఎల్లప్పుడును, వినీతైః=శిక్షితములైనట్టియు, ఆశుగైః= వేగముగాపోవునట్టియు, లక్షణాన్వితైః = శుభలక్షణములతోఁగూడుకొన్నట్టియు, వరరూపోపసంపన్నైః = మంచిరూపసంపత్తిగలిగిన, ధుర్యైః=గుఱ్ఱములచేత, ప్రతోదేన = కొరడాచే, అతుదన్ = కొట్టనివాఁడై, వ్రజేత్ = వెళ్ళవలెను.

తా॥ శిక్షితంబులుగాక నేత్రవ్యాధి పీడితంబులై విరిగినకొమ్ములు, విరిగినగొరిసెలు, గుడ్డికన్నులుగలిగి, కోయఁబడినతోకఁ గలిగినట్టి, యెద్దులు, గుఱ్ఱములు, మొదలైనవానిమీఁద నెక్కిపోఁగూడదు, శిక్షితములై వేగములుగలిగి, వరరూపాదిలక్షణ యుక్తంబులయిన వాహనంబులనెక్కి మిక్కిలి వానిని పీడింపక వెళ్ళిన సుఖముగలుగును.

శ్లో॥ బాలాతపః ప్రేతధూమోవర్జ్యంభిన్నంతథాసనం।
నచ్ఛింద్యాన్నఖలోమానిదంతైర్నోత్పాటయేన్నఖాన్॥

టీ॥ బాలాతపః = లేయెండ; ప్రేతధూమః = పీనుగుపైపొగ; తథా =అట్లనే, భిన్నం= విరిగిన; ఆసనం = పీఠము; వర్జ్యం = విడువవలసినది;

నఖలోమాని = గోళ్ళనురోమములను; నచ్ఛింద్యాత్ = గిల్లరాదు; దంతైః = పండ్లచేత; నఖాన్ = గోళ్ళను; నోత్పాటయేత్ = పెఱకరాదు.

తా॥ లేయుండ, పీనుగుమీదపాగ, విరిగినపీట వీనిని విసర్జించవలెను. గోళ్ళను వెండ్రుకలను గిల్లరాదు. పండ్లచేగోళ్ళను తీయరాదు.

శ్లో॥ లోష్టమర్దీతృణచ్ఛేదీనఖఖాదీచయోనరః।
సవినాశంవ్రజత్యాశుసూచకోశుచిరేవచ॥

టీ॥ యః = ఏమనుజుడు; లోష్టమర్దీ = మంటిపెళ్ళలను నలుపువాడో; తృణచ్ఛేదీ = గడ్డిపీకువాడో; నఖఖాదీ = గోళ్లుకొరుకువాడో; సూచకః = కొండెగాడో; అశుచిరేవ = అపరిశుద్ధుఁడో; సః = వాడు; ఆశు = శీఘ్రముగా; నాశం = నాశనమును; వ్రజతి = పొందుచున్నాఁడు.

తా॥ మంటిపెళ్లనలఁపువాడు, గడ్డిపీకవాడు, గోళ్లుపెరుగువాడు, కొండెములుచెప్పువాడు అపరిశుద్ధుఁడు. వీరువృద్ధిపొందరు, కాబట్టి ఈపనులుచేయకూడదు.

శ్లో॥ నవిగహ్యకథాంకుర్యా ద్బహిర్మాల్యంనధారయేత్।
గవాంచయానంపృష్ఠేనసర్వథైవవిగర్హితం॥

టీ॥ విగర్హ్యకథాం = నిందింపఁదగిన ప్రబంధకల్పనను; నకుర్యాత్ = చేయరాదు; బహిర్మాల్యం = వెలుపలినిర్మాల్యమును; నధారయేత్ = ధరింపరాదు; గవాం = ఎద్దులయొక్క; పృష్ఠేన = వీపుతో; యానం = వెళ్లుట; సర్వథైవ = అన్నిప్రకారములచేత; విగర్హితం = నింద్యము.

తా॥ నల్గురునునిందింపఁదగిన ప్రబంధకల్పనచేయరాదు. వెలుపల మాల్యంబుధరింపరాదు. ఎద్దునెక్కిపోవుట అన్నివిధంబులచేతను నింద్యమైనది.

శ్లో॥ అద్వారేణచనాతీయాద్గ్రామంవావేశ్మవానరః।
రాత్రౌచవృక్షమూలానిదూరతఃపరివర్జయేత్॥

టీ॥ నరః = పురుషుఁడు; గ్రామం = ఊరునుగాని; వేశ్మవా = ఇంటినిగాని; అద్వారేణ = తప్పుద్రోవగుండా; నాతీయాత్ = చేరరాదు; రాత్రౌచ = రాత్రియందు; వృక్షములాని = చెట్లమొదళ్ళను; దూరతః = దూరముగా; పరివర్జయేత్ = విడిచిపెట్టవలయును.

తా॥ గ్రామమునకుఁగాని యింటికిగాని వాకిలినివిడిచి తప్పుత్రోవను పోరాదు, రాత్రియందు వృక్షమూలములను పరిత్యజింపవలెను.

శ్లో॥ నస్నానమాచరేద్భుక్త్వానాతురోనమహానిశి।
నవాసోభిస్సహాజస్రంనావిజ్ఞాతేజలాశయే॥

టీ॥ భుక్త్వా = భోజనముచేసి, స్నానం = స్నానమును, నాచరేత్ = చేయఁగూడదు, ఆతురః = వ్యాధిగ్రస్తుఁడై, న=స్నానమాడరాదు, మహానిశి = అర్ధరాత్రమునందు, న = స్నానముచేయరాదు, అజస్రం = ఎల్లప్పుడును, వాసోభిస్సహ = బట్టలతోఁగూడ, న = స్నానముచేయరాదు, అవిజ్ఞాతే = తానెఱుంగని, జలాశయే=తటాకమునందు, న=స్నానమాడరాదు.

తా॥ భోజనముచేసినపిమ్మట వ్యాధిపీడితుఁడై యున్నప్పుడు అర్ధరాత్రియందును ఎల్లప్పుడు వస్త్రములతోడను తానెఱుఁగని చెఱువునందున స్నానముచేయరాదు.

శ్లో॥ నవైరిణంనోపసేవేతసహాయంచైవవైరిణః।
అధార్మికంతస్కరంచపరస్యైవచయోషితం॥

టీ॥ వైరిణం = విరోధిని, వైరిణః = శత్రువుయొక్క, సహాయం, చ = స్నేహితుని, అధార్మికం = ధర్మబుద్ధిలేనివానిని, తస్కరం = దొంగను, పరస్య = ఇతరునియొక్క, = యోషితం = భార్యను, నోపసేవేత = సేవింపరాదు.

తా॥ శత్రువును, శత్రుస్నేహితుని ధర్మహీనుని, దొంగను, పరస్త్రీని వీరలఁగూడరాదు.

శ్లో॥ సత్యంబ్రూయాత్ప్రియంబ్రూయా న్నబ్రూయాత్సత్యమప్రియం।ప్రియంచనానృతంబ్రూయాదేషధర్మస్సనాతనః॥ భద్రంభద్రమితిబ్రూయాద్భద్రమిత్యేవవావదేత్॥

టీ॥ సత్యం = నిజము, బ్రూయాత్ = పలుకవలెను, ప్రియం = ఇష్టమును, బ్రూయాత్ =పలుకవలెను, సత్యం = నిజమైనదైనను, అప్రియం = అనిష్టమును, నబ్రూయత్ = పలుకరాదు, అనృతం = అబద్ధమైన, ప్రి

యం = ప్రియమును, నబ్రూయాత్ = పలుకరాదు, ఏషః = ఇది, సనాత
నః = ప్రాచీనమైన, ధర్మః = ధర్మము.

తా॥ సత్యముగను, ఇష్టముగను, బలుకవలెను. సత్యమైనదైనను, అ
ప్రియమును బలుకరాదు. ప్రియమైనను అబద్ధమును బలుకరాదు. ఒకనికి
శుభముగల్గునప్పుడు, భద్రముఅని పలుకవలెను.

శ్లో॥ శుష్కవైరంవివాదంచ నకుర్యాత్కేనచిత్సహ॥

టీ॥ కేనచిత్సహ = ఎవ్వనితోగూడ,శుష్క-వైరం = నిష్ప్రయోజనమై
న, విరోధం = విరోధమును, వివాదం = వివాదమును, నకుర్యాత్ =
చేయరాదు.

తా। ఎవనితోనైనను, నిష్ప్రయోజనమైన, విరోధమును, వివాదము
ను, చేయరాదు.

శ్లో॥ హీనాంగానతిరిక్తాంగాన్ విద్యాహీనాన్ వయోధికాన్।
రూపద్రవ్యవిహీనాంశ్చజాతిహీనాంశ్చనాక్షిపేత్॥

టీ॥ హీనాంగాన్ = శరీరముయొక్క అవయములలోకొన్ని లేని
వారలను, అతిరిక్తాంగాన్ = ఉండవలసిన యవయవములకంటె నెక్కుడగ
లిగిన వారలను, విద్యాహీనాన్ = చదువులేనివారలు, వయోధికాన్ = వ
యస్సుచేత నధికులలైనవారలను,రూపద్రవ్యవిహీనాంశ్చ = మంచిరూపము,
ద్రవ్యములేనివారలను, జాతిహీనాన్ = జాతిచేతహీనులను, ఆక్షిపేత్ =
ఆక్షేపింపరాదు.

తా॥ శరీరమునకుండవలసిన యవయములలోకొన్ని లేనివారలనుకొన్ని
యెక్కువగలవారలను, సౌందర్యము, ద్రవ్యము, జాతి, వీనిచేత తక్కువవారై
నవారలను వీరినాక్షేపింపరాదు.

శ్లో॥ శ్రద్దధానాశ్శుభాంవిద్యా మాదదీతావరాదపి।
అంత్యాదపిపరంధర్మంస్త్రీరత్నందుష్కులాదపి॥

టీ॥ అవరాదపి = సుకులీనుడుకాని వానివల్లగూడ, శుభాం = శుభ
మైన,విద్యాం = చదువును,శ్రద్ధధానాః = శ్రద్ధాళులై,ఆదదీత=గ్రహింపవ
లెను. పరం = శ్రేష్ఠమైన, ధర్మం = ధర్మము, అంత్యాదపి = అంత్యజాతి

వానివల్లనైన, ఆదదీత = గ్రహింపవలెను. దుష్కులాదపి=చెడ్డకులమునుండి కూడ, స్త్రీరత్నం = మంచియాడుదానిని,ఆదదీత = గ్రహింపవలెను.

తా॥ మంచివిద్యను జాతిహీనునివల్లనైన శ్రద్ధగలవాడై గ్రహింపవలెను. ఉత్తమమైన, ధర్మమును చండాలునివల్లనైన, గ్రహింపవచ్చును. సద్గుణవతియైనస్త్రీని దుష్కులమువల్లనైన, గ్రహింపవచ్చును.

శ్లో॥ విషాదప్యమృతంగ్రాహ్యంబాలాదపిసుభాషితం।
అమిత్రాదపిసద్వృత్తమమేధ్యాదపికాంచనం॥

టీ॥ విషాదపి = విషమునల్లనైన, అమృతం = అమృతము, గ్రాహ్యం = గ్రహింపఁదగినది, బాలాదపి = బాలునివల్లనైన, సుభాషితం = మంచిమాట, గ్రాహ్యం = గ్రహింపఁదగినది, అమిత్రాదపి = శత్రువువల్లనైన, సద్వృత్తం = మంచినడత, గ్రాహ్యం = గ్రహింపదగినది, అమేధ్యాదపి = అశుద్ధమగు పదార్థమునుండియైన, కాంచనం = బంగారము, గ్రాహ్యం = గ్రహింపఁదగినది.

తా॥ విషమువల్లనైన నమృతంబును గ్రహింపవలెను. బాలునివల్లనైన, మంచిమాట, గ్రహింపవలెను. శత్రువువల్లనైన, మంచినడతనుగ్రహింపవలెను. అశుద్ధమగు వస్తువునుండియైన, బంగారమును, గ్రహింపవలెను.

శ్లో॥ స్త్రియోరత్నాన్యథోవిద్యాధర్మశ్శౌచంసుభాషితం।
వివిధానిచశిల్పానిసమాధేయానిసర్వతః॥

టీ॥ స్త్రియః = గుణవతులగుస్త్రీలు, రత్నాని = రత్నములు, అథో = పిదప, విద్యా = చదువు, ధర్మః = ధర్మము, శౌచం = పారిశుధ్యము, సుభాషితం = మంచిమాట, వివిధాని = అనేకములైన, శిల్పాని = శిల్పము, సర్వతః = అంతటనుండియు, సమాధేయాని = గ్రహింపఁదగినవి.

తా॥ సద్గుణవతులగుస్త్రీలు, రత్నములు, విద్యలు, ధర్మము, పారిశుధ్యము, సద్వాక్యము, నానావిధములైన శిల్పములు, ఎచ్చటనున్నను, గ్రహింపవలెను.

శ్లో॥ హీనజాతిస్త్రియంమోహాదుద్వహంతోద్విజాతయః।
కులాన్యేవనయంత్యాశుససంతానానిశూద్రతాం॥

టీ॥ ద్విజాతయః = బ్రాహ్మణక్షత్రియవైశ్యులు, హీనజాతిస్త్రియం = హీనకులమునఁ బుట్టినస్త్రీని, మోహాత్ = మోహమువలన ఉద్వహంతః = వివాహమాడినవారైనయెడల, ససంతానాని = సంతానములతోఁగూడిన, కులాన్యేవ = వంశములే, శూద్రతాం = శూద్రత్వమును, నయంతి = పొందును.

తా॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు హీనజాతిస్త్రీని, మోహమువలన పరిగ్రహించిరేని, వారికి గలిగెడు సంతానములతోఁగూడ, కులములు శూద్రత్వమును బొందును.

శ్లో॥ యద్యత్పరవశంకర్మతత్తద్యత్నేనవర్జయేత్।
యద్యదాత్మవశంతుస్యాత్తత్తత్సేవేతయత్నతః॥
శ్లో॥ సర్వంపరవశందుఃఖంసర్వమాత్మవశంసుఖం।
ఏతద్విద్యాత్సమాసేన లక్షణంసుఖదుఃఖయోః॥

టీ॥ యద్యత్ = ఏదేది, పరవశం=పరాధీనమైన కర్మ=కర్మమో, తత్తత్ = దానినిదానిని, యత్నేన = ప్రయత్నముచేత, వర్జయేత్ = విడువవలెను. యద్యత్ = ఏదేది, ఆత్మవశం = స్వాధీనమైనది, స్యాత్ = అగునో, తత్తత్ = ఆయాదానిని, యత్నతః = ప్రయత్నమువలన, సేవేత = సేవింపవలెను, పరవశం = పరాధీనమైన, సర్వం=అంతయును, దుఃఖం = దుఃఖకరము, ఆత్మవశం = స్వాధీనమైనది, సర్వం = అంతయు, సుఖం = సుఖకరము, ఏతత్ = దీని, సమాసేన = సంక్షేపముగా, సుఖదుఃఖయోః = సుఖదుఃఖములయొక్క, లక్షణం=లక్షణముగా, విద్యాత్ = తెలుసుకొనవలెను.

తా॥ పరాధీనమయిన కార్యమును విడువవలయును, స్వాధీనమయిన కార్యమును చేయవలయును, ఏలయన పరాధీన కార్యములు దుఃఖకరములు, స్వాధీనకార్యములు సుఖకరములు ఇది సంక్షేపముగా సుఖదుఃఖములకు లక్షణము.

శ్లో॥ ఋతామృతాభ్యాంజీవేత్తుమృతేనప్రమృతేనవా।
సత్యానృతాభ్యామపివా।నశ్వవృత్త్యాకదాచన॥

టీ॥ విప్రః = బ్రాహ్మణుడు, ఋతామృతాభ్యాం = ఉంఛవృత్తి చేతను శిలవృత్తిచేతగాని యాదృచ్ఛికలబ్ధమగుదాని చేతగాని, మృతేన = యాచనచేతగాని, ప్రమృతేన = కృషిచేతగాని సత్యానృతేన = వర్తకము చేతగాని, జీవేత్ = జీవనముచేయవలయును, శ్వవృత్త్యా = ఒకనికికొలువుం డుటచేత కదాచన = ఎప్పుడును, జీవేత్ = జీవింపగూడదు.

తా॥ ఇండ్లయందు రాల్ఛ మొదటబడిన గింజలనేరుకొని జీవించు ట ఉంఛవత్తి మళ్ళలోని యెన్నులు దెచ్చికొని జీవించుట శిలవృత్తి ఈ రెండును, ఋతమనఁబడును. అమృతమనఁగా ఒరునియాచింపక, యదృ చ్ఛాలబ్ధమైన ద్రవ్యముచేత జీవించుట మృతమనగా యాచించుటవలన లభించినద్రవ్యముచేత జీవించుట ప్రమృతమనఁగా కృషిసత్యానృతమనఁ గా వర్తకము శ్వవృత్తియనగాఁ గొలువుండుట ఇందుబ్రాహ్మణునకు వె నుకచెప్పఁబడిన నొకవృత్తికంటె మరియొకవృత్తి మేలైనది. గనుక ఉంఛవృ త్తిమొదలు వాణిజ్యమువరకు చెప్పఁబడిన వృత్తులచే జీవింపవచ్చునుగాని, బ్రాహ్మణుండు శ్వవృత్తిచేత నెప్పుడును, జీవింపరాదు.

శ్లో॥ విప్రాణాంజ్ఞానతోజ్యైష్ఠ్యంక్షత్రియాణాంతువీర్యతః।
వైశ్యానాంధాన్యధనతశ్శూద్రాణామేవజన్మతః॥

టీ॥ విప్రాణాం = బ్రాహ్మణులకు, జ్ఞానతః = జ్ఞానమువలన, జ్యై ష్ఠ్యం = పెద్దతనము, క్షత్రియాణాం = రాజులకు,వీర్యతః = పరాక్రమమువ లననే, జ్యైష్ఠ్యం = పెద్దతనము, వైశ్యానాం = కోమటులకు,ధాన్యధనతః = ధాన్యధనములవలన, జ్యైష్ఠ్యం = పెద్దతనము, శూద్రాణాం = శూద్రులకు జన్మతః = వయోధికవలననే, జ్యైష్ఠ్యం = పెద్దతనము.

తా॥ బ్రాహ్మణులలో, జ్ఞానముగలవాడుపెద్ద, క్షత్రియులలో ప రాక్రమవంతుఁడుపెద్ద, వైశ్యులలోధనధాన్యములు గలవాడుపెద్ద, శూద్రుల లో వయసుచేతపెద్దయేపెద్ద.

శ్లో॥ వి త్తంబంధుర్వయఃకర్మవిద్యాభవతిపంచమీ।
ఏతానిమాన్యస్థానంచగరీయోయద్యదుత్తరం॥

టీ॥ వి త్తం = ధనము, బంధుః = బంధువు, వయః = వయసు్స, క ర్మ = కర్మము, పంచమీ = ఐదవదియను, విద్యా = చదువును, మాన్యస్థానం = సన్మానింపఁదగినది, భవతి = అగుచున్నది, ఏతేషు = వీనియందు,యద్యత్ = ఏదేది, ఉత్తరం = ఉత్తరమందున్నదో,తత్ =అదిగరీయః = శ్రేష్ఠమైనది.

తా॥ ధనము, బంధుత్వము, వయసు్స, కర్మ, విద్య, ఈఐదునుసమ్మానింపఁదగినస్థానములు. అందునుధనికునికంటె, బంధువును, బంధువునికంటె వయసు్సచేత పెద్దవాఁడు, వయోధికునికంటె, సత్తమకార్యములు చేయువాడు, వానికంటె, విద్యావంతుఁడు శ్రేష్ఠుడు.

శ్లో॥ విద్యానామనరస్యరూపమధికంప్రచ్ఛన్నగుప్తంధనంవిద్యా
భోగకరీయశస్సుఖకరీవిద్యాగురూణాంగురుః। విద్యా
బంధుజనోవిదేశగమనే విద్యాపరాదేవతావిద్యా
రాజసుపూజ్యతేనహిధనంవిద్యావిహీనఃపశుః॥

టీ॥ విద్యానామ = విద్యయనఁగా, నరస్య = పురుషునకు, అధికం = ఎక్కుడైన, రూపం = అందమైనయాకారము, (విద్యా = విద్య) ప్రచ్ఛన్నగుప్తం = రహస్యముగాదాపఁబడిన, ధనం = ధనము, విద్యా = విద్య, భోగకరీ = భోగమునుచేయును, యశస్సుఖరీ = కీర్తిని సుకమునుజేయును, విద్యా = విద్య, గురూణాం = గురువులకు, గురుః = గురువుఅనఁగాపూజ్యమైనది, విద్యా = విద్య, విదేశగమనే = పరదేశములకువెళ్లినప్పుడు, బంధుజనః = బంధువు, విద్యా = విద్య, పరా = ఉత్కృష్టమైన, దేవతా = దేవత విద్యా = విద్య, రాజసు = రాజులయందు, పూజ్యతే = పూజింపఁబడుచున్నది, నహిధనం = (విద్యతోసమమైన) ధనములేదు, విద్యావిహీనః, = విద్యరానివాఁడు. పశుః = పసరముతోసమానము.

తా॥ విద్యపురుషునకు శ్రేష్ఠమైనరూపము, రహస్యముగాదాచిన ధనము, భోగము కీర్తిని సుఖమును గలుగఁజేయునది. గురువులకందఱకు పూజ్య

మైనది. దేశాంతర గమనమున బంధుజనమువలె రక్షించునది. ఉత్తమమైన దైవమువలె నభీష్టముల నిచ్చునది. ప్రభువులన బూజింపఁబడునది. విద్యకు సరియైన ధనము లేదు. గావున నట్టివిద్యలేనివాడు పశుప్రాయుఁడు,

శ్లో॥ క్షాంతిశ్చేత్కవచేనకింకిమరిభిఃక్రోధోస్తిచేద్దేహినాం। జ్ఞాతిశ్చేదనలేనకింయదిసుహృద్దివ్యౌషధైఃకింఫలం।కింసర్పైర్యదిదుర్జనాఃకిముధనైర్విద్యానవద్యాయది। వ్రీడాచేత్కిముభూషణైస్సుకవితాయద్యస్తిరాజ్యేనకిం॥

టీ॥ దేహినాం = ప్రాణులకు, క్షాంతిశ్చేత్ = ఓర్పుఉన్నయెడల, కవచేన = కవచము తో కిం = ఏమిప్రయోజనము, క్రోధః = కోపము, అస్తిచేత్ = ఉన్నయెడల, అరిభిః = శత్రువులచేత, కిం = ఏమిప్రయోజనము, జ్ఞాతిః = దాయాది, అస్తిచేత్ = ఉన్నయెడల, అనలేన = నిప్పుచేత, కిం = ఏమిప్రయోజనము, సుహృత్ = స్నేహితుఁడు, అస్తిచేత్ = ఉన్నయెడల, దివ్యౌషధైః = మంచిఔషధములచే, కిం = ఏమిప్రయోజనము, అనవద్యా = గొప్పదియగు, విద్యా = చదువు, అస్తియది = ఉన్నయెడల, ధనైఃకిము = ధనముచేనేమిప్రయోజనము, వ్రీడా = సిగ్గు, అస్తిచేత్ = ఉన్నయెడల, భూషణైఃకిం = అలంకారములచేతనేమిప్రయోజనము, సుకవితా = మంచికవనము, అస్తియది = ఉన్నయెడల, రాజ్యేన = రాజ్యముచేత కిం = ఏమిప్రయోజనము.

తా॥ ఓరుపు కవచమువంటిది, క్రోధము శత్రువువంటిది, జ్ఞాతి నిప్పువంటివాఁడు, స్నేహితుఁడు దివ్యౌషధమువంటివాఁడు, దుర్జనులుసర్పమువంటివారు, అమోఘమైన విద్యయున్నయెడల ధనముచేతనేమిప్రయోజనము, సుకవిత్వము రాజ్యమువంటిది.

శ్లో॥ దాక్షిణ్యంస్వజనేదయాపరిజనేశాఠ్యంసదాదుర్జనే। ప్రీతిస్సాధుజనేనయోనృపజనేవిద్వజ్జనేచార్జవం। శౌర్యంశ

శ్రత్రుజనేక్షమాగురుజనేకాంతాజనే ధృష్టతా। యేచైవంపురుషాఃకళాసుకుశలాస్తేష్వేవలోకస్థితిః॥

టీ॥ స్వజనే = తనవారియందు, దాక్షిణ్యం = దాక్షిణ్య భావమును పరిజనే = నౌకరులయందు దయా = దయయు దుర్జనే = దుష్టుని యందు, సదా = ఎల్లప్పుడును, శాఠ్యం = కాపట్యమును సాధుజనే = సత్పురుషుల యందు ప్రీతిః = అనురాగము, నృపజనే = రాజులయందు, నయః = నీతియును, విద్వజ్జనే = పండితులయందు, ఆర్జవం = నిష్కాపట్యమును, శత్రుజనే = శత్రువులయందు, శౌర్యం = పరాక్రమమును, గురుజనే = పెద్దలయందు, క్షమ = తాల్మియు, కాంతాజనే = స్త్రీలయందు, ధృష్టతా = దిట్టతనమును యేపురుషాః = ఏపురుషులు, ఏనం = ఈవిధముగా, కళాసు = విద్యలయందు కుశలాః = నిపుణులో తేష్వేన = వారలయందే, లోకస్థితిః = లోకముయొక్క యునికి.

తా॥ బంధుజనులయందు దాక్షిణ్యమును భృత్యులయందు దయయును దుర్జనులయందు కపటమును సజ్జనులయందు ప్రీతియును రాజులయందు నీతియును, విద్వజ్జనులయందు నిష్కాపట్యమును శత్రువులయందు శౌర్యమును గురువులయందు తాల్మియును స్త్రీలయెడ దిట్టతనమును గలిగి ప్రవర్తించునట్టి విద్యాప్రావీణ్యము గల పురుషుల యందు లోకము నిలుచును.

శ్లో॥ జాడ్యంధియోహరతిసించతివాచిసత్యం। మానోన్నతిందిశతిపాపమపాకరోతి। చేతఃప్రసాదయతిదిక్షుతనోతికీ

ర్తింసత్సంగతిఃకథయకింనకరోతిపుంసాం॥

టీ॥ పుంసాం = పురుషులకు, సత్సంగతిః = సజ్జన సాంగత్యము ధియః = బుద్ధియొక్క, జాడ్యం = జడత్వమును, హరతి = హరించుచున్నది. వాచి = వాక్కునందు, సత్యం = సత్యమును సించతి = కల్గించుచున్నది. మానోన్నతిం = గొప్పగౌరవమును, దిశతి = ఇచ్చుచున్నది, పాపం = పాపమును, అపాకరోతి = నశింపజేయును. చేతః = మనస్సును, ప్రసాదయతి = నిర్మలముగ జేయును. దిక్షు = దిక్కులయందు, కీర్తిం = కీర్తిని, తనోతి = వ్యాపింపజేయును, కథయ = చెప్పుము, కింనకరోతి = ఏమిచేయదు.

తా॥ సత్సాంగత్యము బుద్ధిజాడ్యమును పోగొట్టును. వాక్కునందు సత్యమును కలుగజేయును. గౌరవమునిచ్చును. పాపముల పోగొట్టును మనస్సును స్వచ్ఛముగాఁజేయును. కీర్తిని దిక్కులందు విస్తరింపఁజేయును. ఇంకను ఎంతటి సౌఖ్యము కల్గింపదు?

శ్లో॥ దౌర్మంత్ర్యాన్నృపతిర్వినశ్యతియతిస్సంగాత్సుతోలాలనా। ద్విప్రోనధ్యయనాత్కులం కుతనయాచ్ఛీలంఖలోపాసనాత్। హ్రీర్మద్యాదనపేక్షణాదపికృషిస్స్నేహః ప్రవాసాశ్రయాన్మైత్రీచాప్రణయాత్సమృద్ధిరనయాత్త్యాగాత్ప్రమాదాద్ధనం॥

టీ॥ నృపతిః = రాజు, దౌర్మంత్ర్యాత్ = దుర్మంత్రికలుగుట వలన వినశ్యతి = నశించుచును, (వినశ్యతి యను క్రియయంతటను అన్వయించుకొనవలెను.) యతిః = సన్న్యాసి.సంగాత్ = స్నేహమువలన వినశ్యతి = నశించును. లాలనాత్ = గారాబమువలన, సుతః = కొడుకు, వినశ్యతి = చెడిపోవును, అనధ్యయనాత్ = చదువకపోవుటవలన, విప్రః = బ్రాహ్మణుడు వినశ్యతి = చెడును. ఖలోపాసనాత్ = దుస్సాంగత్యము వలన శీలం = స్వభావము, వినశ్యతి = చెడును. కుతనయాత్ =దుష్టపుత్రునివలన కులం = కులము, వినశ్యతి = చెడును. మద్యాత్ =మద్యపానమువలన హ్రీః = సిగ్గు, వినశ్యతి = చెడును, అనపేక్షణాత్ = సరిగచూడక పోవుటవలన కృషిః = కృషి, వినశ్యతి = చెడును, ప్రవాసాశ్రయాత్ = పరదేశ నివాసము వలన స్నేహః = స్నేహము, వినశ్యతి = నశించును, అప్రణయాత్ = ప్రణయము లేక పోవుట వలన, సమృద్ధిః = సమృద్ధి. వినశ్యతి = నశించును. అనయాత్ = నీతిలేకపోవుటవలన, త్యాగాత్ = ఈవివలన, ప్రమాదాత్ = ప్రమాదమువలన, ధనం = ద్రవ్యము, వినశ్యతి = నశించును.

తా॥ దుర్మంత్రిగలుగుటవలనరాజును,సంగమమువలనసన్న్యాసియు, లాలనమువలన బుత్రుండును, వేదముచదువకపోవుటవలన బ్రాహ్మణుడును, దుష్టపుత్రునివలనకులంబును, దుష్టసాంగత్యమువలన సత్స్వభావమును, మద్యపానమువలనసిగ్గును, చూడకపోవుటవలన కృషియును, పరదేశగమనమువల

నస్నేహము, ప్రణయములేకపోవుటవలన సమృద్ధియును, నీతిలేకపోవుట ఖిక్కిలియిచ్చుట ప్రమాదము ఈమూటివలన ధనంబునశించును.

శ్లో॥ దానంభోగోనాశ స్తిస్రో గతయోభవంతివి త్తస్య।
యోనదదాతినభుం క్తేతస్యతృతీయాగతిర్భవతి॥

టీ॥ విత్తస్య = ధనమునకు, దానం = ఒకరికిచ్చుట, భోగః = అనుభవించుట, నాశః = నశించుట, తిస్రః = మూఁడైన, గతయః = అవస్థలు భవంతి = ఉన్నవి, యః = ఎవఁడు, నదదాతి = ఇవ్వఁడో, నభుంక్తే = అనుభవింపఁడో, తస్య = వానియొక్క, విత్తం = ద్రవ్యము, తృతీయా = మూఁడవదియగు, గతిః = గతి, భవతి = (కలిగినది) అగుచున్నది.

తా॥ ధనమునకు దానము, అనుభవము, నాశము, అనిమూఁడవస్థలు గలవు. ఏధనికుఁడు. ఒకనికీయక తాననుభవింపకయుండునో వానిధనము మూఁడవయవస్థయగు, నాశమును బొందును.

శ్లో॥ యస్యాస్తివిత్తంసనరఃకులీనస్సపండితస్సశ్రుతవాన్విధిజ్ఞః।
సఏవవక్తాసచదర్శనీయస్సర్వేగుణాఃకాంచనమాశ్రయంతి

టీ॥ యస్య = ఎవనికి, విత్తం = ధనము, అస్తి = కలదో, సః = ఆ నరః = మనుష్యుఁడే, కులీనః = సత్కులవంతుఁడు, సః = అతఁడే, పండిత - పండితుఁడు, సః = అతఁడే, శ్రుతవాన్ = శాస్త్రజ్ఞుడు, విధిజ్ఞః = కర్తవ్యాకర్తవ్యముల నెఱింగినవాఁడు, సఏవ = అతఁడే, వక్తా = పలుకనేర్చినవాఁడు, సచ = అతఁడే, దర్శనీయః = చూడదగినవాఁడు, సర్వే = అన్ని, గుణాః = గుణములు కాంచనం = ధనమును, ఆశ్రయంతి = ఆశ్రయించుచున్నవి.

తా॥ ధనముగలవాఁడే, సత్కులుఁడు, వాఁడే పండితుఁడు, వాఁడే శాస్త్రజ్ఞుడు, వాఁడేకర్తవ్యాకర్తవ్యముల నెఱింగినవాఁడు, గనుక సకలగుణంబులును ధనము నాశ్రయించుచున్నది.

శ్లో॥ దుర్జనఃపరిహర్తవ్యో విద్యయాలంకృతోపిసన్
మణినాభూషితస్సర్పఃకిమసౌనభయంకరః॥

టీ॥ విద్యయా = విద్యచేత, అలంకృతోఽపి = అలంకరింపఁబడినవాఁడైనను, సః = ఆదుర్జనః = దుష్టుఁడు పరిహర్తవ్యః = విడువఁదగినవాఁ

డు, సర్పః = పాము, మణినా = మణిచేత, భూషితః=అలంకరింపఁబడినదై నను, అసౌ = ఈపాము, భయంకరః = భయమునుకల్గించునది, న=కాదా.

తా॥ రత్నముచేత, భూషింపఁబడినదైనను, సర్పమెట్లు, భయంకరమైనదో. ఆరీతిగ, దుర్జనుఁడు విద్యచేత నలంకరింపఁబడినవాఁడై యుండి యును దూరముగా వర్జింపఁదగినవాడు.

శ్లో॥ జాడ్యంహ్రీమతిగణ్యతేవ్రతరతేదంభశ్శుచౌకైతవం। శూరేనిర్ఘృణతామునౌవిమతితాదైన్యంప్రియాలాపిని। తేజస్విన్యవలిప్తతాముఖరతావక్తర్యశక్తిస్థిరే తత్కోనామగుణోభవేత్సగుణినాంయోదుర్జనైర్నాంకితః॥

టీ॥ హ్రీమతి = సిగ్గుగలవానియందు, (అభిమానముగలవానియందు) జాడ్యం = జడత్వము, గణ్యతే = ఎన్నఁబడుచున్నది, వ్రతరతే = వ్రతముల యందాశక్తి గలవానియందు, దంభః = మిషు, గణ్యతే = గణింపఁబడుచు న్నది, శుచౌ = ఆచారపరునియందు, కైతవం = కపటము, గణ్యతే = గణింపఁబడుచున్నది. శూరే = శౌర్యముగలవానియందు, నిర్ఘృణతా = కరుణలే కపోవుట, గణ్యతే = ఎంచబడుచున్నది, మునౌ = మునియందు, విమతితా = మూఢత్వము, గణ్యతే = ఎంచబడుచున్నది, ప్రియాలాపిని = ప్రియముగ మాటలాడువానియందు, దైన్యం = దీనత్వము, గణ్యతే = గణింపఁబడుచున్నవి, తేజస్విని = తేజముగలవానియందు, అవలిప్తతా = గర్వము, గణ్యతే = ఎంచఁబడుచున్నది, వక్తరి = పలుకుశక్తిగలవానియందు, ముఖరతా = వాచాటత్వము, గణ్యతే = గణింపఁబడుచున్నది, స్థిరే = స్థిరుని యందు, అశక్తిః = శక్తిలేకపోవుట, గణ్యతే = ఎంచబడుచున్నది, సుగుణినాం = గుణవంతులయొక్క యః = ఏ,గుణః = గుణము, దుర్జనైః=దుష్టులచే, నాంకితః = (చెడ్డగుర్తువేయఁబడలేదో,) (సః) గుణః = ఆగుణము కోనామ = ఏదైయుండును.

తా॥ దుర్జనుఁడు, సజ్జనులందు, సద్గుణములను దుర్గుణములుగానెంచును. ఎట్లనిన లజ్జావంతునిజూచి జడుఁడనిచెప్పును. వ్రతశీలుని దాంభికుఁడని చెప్పును. ఆచారవంతుని కపటుఁడనిచెప్పును. శూరునినిర్దయుఁడనిచెప్పును.(ప్రి

యే। తేమీమానుషరాక్షసాఃపరహితంస్వార్థాయనిఘ్నం
తి యే। యేతుఘ్నంతినిరర్థకంపరహితంతేకేనజానీమహే॥

టీ॥ స్వార్థాన్ = తమకార్యములను, పరిత్యజ్య = విడిచి, యేఎవరు పరార్థఘటకాః = ఇతరుల పనులను సానుకూలపఱచెదరో, ఏతే = వీరు, సత్పురుషాః = మంచివారు, స్వార్థావిరోధేన = తమ కార్యమునకు విరోధము లేక యే = ఎవరు, పరార్థం = పరకార్యమును, ఉద్యమభృతః = వహింతురో (తే = వారు) సామాన్యాః = సామాన్యులు, స్వార్థాయ = తమ కార్యము కొఱకు, యే = ఎవరు, పరహితం = పరులకిష్టమగు కార్యమును నిఘ్నంతి = పాడుచేయుదురో, తేమీ = ఆవీరుల, మానుషరాక్షసాః = మనుష్యులను రాక్షసులు యే = ఎవరు, నిరర్థకం = సప్రయోజనములులేక యే, పరహితం = ఇతరుల కిష్టమగు కార్యము నిఘ్నంతి = పాడుచేయుదురో, తే = వారు, కే = ఎవరో, నజానీమహే = తెలిసుకొనజాలము.

తా॥ తమకార్యములను వదలి నితరకార్యములను చక్కబెట్టువారు సత్పురుషులు, తమకార్యములకు విరోధంబులేక యితరులకార్యమును జక్కబెట్టువారు మధ్యములు, తమకార్యముకొఱకు నితరులకార్యము చెఱుపువారు మానుషరాక్షసులు, తమకొక ప్రయోజనములేక వ్యర్థముగాబరుల కార్యములను జెఱుపువారెవ్వరో యెఱుగము.

శ్లో॥ పద్మాకరందినకరోవికచంకరోతిచంద్రోవికాస
యతికైరవచక్రవాళం। నాభ్యర్థితోజలధరోపిజ
లందదాతి।సంతస్స్వయంపరహితేవిహితాభియోగాః॥

టీ॥ దినకరః = సూర్యుఁడు, పద్మాకరం = కమలములగుంపు, వికచం = వికసించినదానినిగా, కరోతి = చేయుచున్నాఁడు, చంద్రః = చంద్రుఁడు, కైరవచక్రవాళం = కలువలగుంపును, వికాసయతి = వికసింపఁజేయును, జలదః = మేఘము, నాభ్యర్థితోపి = ప్రార్థింపఁబడనిదైనను, జలం = నీటిని దదాతి = యిచ్చుచున్నది, సంతః = సత్పురుషులు, పరహితే = పరులకుహితమగుకార్యములయందు, స్వయం = స్వయముగనే, విహితాభియోగాః = హితముచేయుటయందు నుద్యుక్తులగుదురు.

తా॥ సూర్యుఁడు కమలముల వికసింపఁజేయుచున్నాఁడు, చంద్రుఁడు కలువల వికసింపఁజేయుచున్నాఁడు, మేఘములు యాచింపబడక నీటి నిచ్చుచున్నవి. అరీతిగ సత్పురుషులు ఇతరులకు హితముచేయుటయందు నుద్యుక్తులై యుందురు,

శ్లో॥ నైవాకృతిఃఫలతినైవకులం నశీలం విద్యాపినైవనచయ
త్నకృతాపిసేవా।భాగ్యానిపూర్వతపసాఖలుసంచితానికా
లేఫలంతిపురుషస్యయథైవవృక్షాః॥

టీ॥ ఆకృతిః=చక్కనియాకారము, నైవఫలతి=ఫలమును గల్గించదు కులంచ=కులమును, (నఫలతి) శీలం=స్వభావము, (నఫలతి) విద్యాపి=చదువుయును (నఫలతి) యత్నకృతా=ప్రయత్నముచేత చేయబడిన సేవయు న ఫలతి, పూర్వతపసా=పూర్వజన్మమున చేసిన తపస్సుచేత, సంచితాని=సంపాదింపఁబడిన భాగ్యాని=భాగ్యములు పురుషస్య=పురుషునకు కాలే=కాలము ప్రాప్తింపఁగా, యథైవ=ఎట్లు, వృక్షాః=చెట్లు, ఫలతి=ఫలించునో (తథా=అట్లుగా) ఫలంతి=ఫలించును.

తా॥ సౌందర్యము కులము శీలము విద్య యత్నముచే నొనర్చిన సేవ ఇవి ఫలమును గలుగఁజేయజాలవు. జన్మాంతరతపస్సుచేత సంపాదింపబడిన భాగ్యములు పురుషుని ప్రాప్తికాలము వచ్చినపుడు వృక్షములు ఫలించు నట్లు ఫలించును.

శ్లో॥ త్యజదుర్జనసంసర్గంభజసాధుసమాగమమ్॥
కురుపుణ్యమహోరాత్రింస్మరనిత్యమనిత్యతాం॥

టీ॥ దుర్జనసంసర్గం=దుర్జనసాంగత్యమును, త్యజ=విడువుము, సాధుసమాగమం=సత్పురుషుల యొక్క సమావేశమును, భజ=పొందుము, అహోరాత్రం=రేయింబవళ్ళు, పుణ్యం=పుణ్యమును, కురు=చేయుము, నిత్యం=నిత్యము పలచు పదార్థమును అనిత్యతాం=నిత్యము గాని దానినిగా స్మర=స్మరింపుము.

తా॥ పురుషుఁడు దేహమనిత్యమని తలఁచి రేయింబవళ్లు పుణ్యముజేసి దుర్జనసాంగత్యమును విడిచి సజ్జనసాంగత్యము చేయవలయును.

శ్లో॥ ముఖంప్రసన్నంవిమలాచదృష్టిః కథానురాగోమధురాచ వాణీ। ప్రేమాధిక స్నేహితదర్శనేన సదానురక్తస్య జనస్యలక్షణం॥

టీ॥ ముఖం=మొగము, ప్రసన్నం=నిర్మలము (అయియుండుట) దృష్టిః=చూపు, విమలా=విమలమైయుండుట, కథాను రాగః=పురాణ కథలయం దనురాగము (కలిగియుండుట) వాణీ=వాక్కు, మధురా=మధురమై (యుండుటయు) స్నేహితదర్శనేన=సదా మిత్రులను జూచిన తోడనే, ప్రేమాధికః=మిక్కిలిప్రేమించుటయు, అనురక్తస్య=సరసుఁడైన జనస్య=జనుని యొక్క లక్షణం=లక్షణమును.

తా॥ నవ్వుమొగమును చల్లనిచూపులును పెద్దలుచెప్పుపురాణకథలందు వినవలెనను తలంపుయు మృదుభాషయును విశేషముగ స్నేహితులను చూచినతోడనే సంతోషము గలుగుటయు ఇవిసరసుని లక్షణములు.

శ్లో॥ అతుష్టిదానంకృతపూర్వనాశనం అమాననందుశ్చరితానుకీర్తనం। కథాప్రసంగేషుచనామవిస్మృతిర్వి రక్తభావస్య జనస్యలక్షణం॥

టీ॥ అతుష్టిదానం=సంతుష్టిలేక యిచ్చుట, కృతపూర్వనాశనం=చేసినమేలును మరచుట, అమాననం= అమవాస్యవలె ముఖముండుట (కళావిహీనమైయుండుట) దుశ్చరితానుకీర్తనం=దుర్మార్గులను పొగడుట, కథాప్రసంగేషు=పురాణాది కథలు జరుగు చుండఁగా, నావిస్మృతిః=తన పేరు తానే మరచిపోయి యుండుట (ఇం) విరక్తభావస్య=దుష్టుఁడగు, జనస్య=మనుజునియొక్క, లక్షణం=లక్షణమును.

తా॥ సంతుష్టి లేక యిచ్చుట చేసిన మేలును మరచుట, ముఖముకళావిహీనమై యుండుట దుర్మార్గుల పొగడు చుండుట పెద్దలు పురాణములు చెప్పుచుండఁగా జ్ఞప్తిలేకుండుట ఇవి విరసుల లక్షణములు.

శ్లో॥ గోభిర్విప్రైశ్చ వేదైశ్చ సతీభిస్సత్యవాదిభిః।
అలుబ్ధైర్దానశీలైశ్చ సప్తభిర్ధార్యతే మహీ॥

టీ॥ గోభిః=గోవులచేతను, విప్రైః=బ్రాహ్మణుల చేతను వేదైశ్చ=వేదములచేతను, సతీభిః=పతివ్రతలచేతను, సత్యవాదిభిః=సత్యవాదుల చేతను అలుబ్ధైః=నిరాశగలవారిచేతను, దానశీలైః=దానస్వభావముగలవారల చేతను ఈసప్తభిః=ఏడుగురు చేతను, మహీ=భూమి, ధార్యతే=ధరింప బడును.

తా॥ గోవులచేతను బ్రాహ్మణులచేతను వేదములచేతను పతివ్రతల చేతను సత్యవాదులచేతను దాతృత్వముగలవారిచేతను దానధర్మములుచేయు వారిచేతను ఈభూమి యుద్ధరింపఁబడుచున్నది.

శ్లో॥ అస్థిరంజీవనంలోకేఅస్థిరంయౌవనంధనం।
అస్థిరందారపుత్రాదిధర్మకీర్తిద్వయంస్థిరం॥

టీ॥ లోకే = లోకమందు; జీవనం = బ్రతుకు; అస్థిరం = స్థిరముగాదు; యౌవనం = యౌవనము; అస్థిరం = స్థిరముగాదు; ధనం = ధనము; అస్థిరం=స్థిరముగాదు; దారపుత్రాది = పెండ్లాముకొడుకులు మొదలగువారు; అస్థిరం = స్థిరముగాదు; ధర్మకీర్తిద్వయం = ధర్మము కీర్తిఅను నీరెండును; స్థిరం = స్థిరములైనవి.

తా॥ జీవితకాలము, ధనము, యౌవనము, దారపుత్రాదులు, ఇవిఅస్థిరములు తాముచేసినధర్మమును దానివలనగలిగెడుకీర్తియు ఈరెండును శాశ్వతములు.

శ్లో॥ చింతాజ్వరోమనుష్యాణాం వస్త్రాణామాతపోజ్వరః।
అసౌభాగ్యంజ్వరః స్త్రీణామశ్వానాంమైథునంజ్వరః॥

టీ॥ మనుష్యాణాం= మానవులకు; చింతా = విచారమే; జ్వరః=జ్వరము; వస్త్రాణాం = బట్టలకు; ఆతపః = వేడిమియే; జ్వరః = జ్వరము, స్త్రీణాం= స్త్రీలకు; భాగ్యం = భాగ్యమే; అసౌజ్వరః = ఈజ్వరము; అశ్వానాం= గుఱ్ఱములకు; మైథునం = మైథునమే; జ్వరః = జ్వరము.

తా॥ ఎల్లప్పుడేదైననొక చింతతోనుండుటయే మనుష్యులకు జ్వరము వస్త్రంబులకు వేడిమితోనుండుటయే జ్వరము స్త్రీలకు భాగ్యమేజ్వరము గుఱ్ఱములకుమైథునంబొనర్చుటయేజ్వరము.

శ్లో॥ అతిదానేబలిర్బద్ధోఅతిమానేచకౌరవాః।
అత్యుగ్రోరావణోనష్టస్సర్వమత్యంతగర్హితమ్॥

టీ॥ బలిః = బలిచక్రవర్తి, అతిదానే = అతిదానమందు, బద్ధః = బద్ధుఁడయ్యెను, అతిమానే = మిక్కిలికోపముగనుంటయందు, కౌరవా = కౌరవులు, (చెడిపోయిరి) అత్యుగ్రః = మిక్కిలి యుగ్రుఁడైనందున రావణః = రావణుండు, నష్టః = నష్టమునుపొందెను, సర్వం = అంతయు అత్యంతగర్హితం = మిక్కిలినింద్యమైనది.

తా॥ అతిదానంబొనర్చుచుండిన బలిచక్రవర్తి బద్ధుఁడయ్యెను అతి మానంబుగానుండినందున కౌరవులునశించిరి అత్యుగ్రుఁడైనందున రావణుఁడుమరణించె కావున అతి యెవరికినిగూడదు. సర్వవిషయములయందు మితముగానుండవలెను.

శ్లో॥ మనస్యేకంవచస్యేకం కర్మణ్యేకంమహాత్మనామ్।
మనస్యన్యద్వచస్యన్యత్కర్మణ్యన్యద్దురాత్మనామ్॥

టీ॥ మహాత్మనాం = సత్పురుషులకు, మనసి = హృదయమందును, వచసి = వాక్కునందును, ఏకం = ఒక్కటి, కర్మణి = కర్మయందు, ఏకం =ఒక్కటి, దురాత్మనాం=దుష్టులకు, మనసి=మనస్సునందు, అన్యత్ =వేరు, వచసి=మాటయందు అన్యత్ =వేరు, కర్మణి=కర్మయందు, అన్యత్ =వేరు.

తా॥ మహాత్ములకు మనస్సు మాటలందును కార్యములందును, ఒక్కటిగనేయుండును దుష్టులకు మనస్సునందొకటి మాటలందొకటి కార్యములందొకటిగను ఉండును.

శ్లో॥ పరోక్షేకార్యహంతారంప్రత్యక్షేప్రియవాదినమ్।
వర్జయేత్తాదృశంమిత్రంవిషకుంభపయోముఖమ్॥

టీ॥ పరోక్షే=ఎదుటలేనప్పుడు కార్యహంతారం= కార్యమునుచెడ గొట్టునట్టిన్ని; ప్రత్యక్షే = ఎదుటనున్నప్పుడు; ప్రియవాదినం = ఇంపుగ

మాట్లాడునట్టి; తాదృశం = అట్టి; మిత్రం = స్నేహితుని; విషకుంభపయో ముఖం = ముఖమునపాలునులోపలవిషమునుగల కుండ (వలె) వర్జయేత్ = విడువవలయును.

తా॥ మనుజుఁడు ఎదుటలేనపుడు వానికార్యమును జెరుపువాడును వాడెదుటనుండునపుడు ప్రియముగ భాషించువాడునగు మిత్రునిముఖమున పాలు లోనవిషమునుగలకుండవలె విడువవలయును.

శ్లో॥ సుఖస్యానంతరందుఃఖందుఃఖస్యానంతరంసుఖమ్।
చక్రవత్పరివర్తంతేదుఃఖానిచసుఖానిచ॥

టీ॥ సుఖస్య=సుఖమునకు, అనంతరం=తరువాత, దుఃఖం=దుఃఖము, దుఃఖస్య=దుఃఖమునకు, అనంతరం=తర్వాత, సుఖం=సుఖము, చక్రవత్= చక్రమువలె, సుఖాని=సుఖములను, దుఃఖానిచ=దుఃఖములు, పరివర్తంతే= తిరుగుచుండును.

తా॥ ప్రథమంబున సుఖంబుగలిగెనేని తోడనేదుఃఖముకలుగును. ప్రథమమున దుఃఖముకలిగినేని పిమ్మటసుఖముకలుగును, కావున దుఃఖంబును సుఖంబును చక్రంబువలెతిరుగుచుండును.

శ్లో॥ ఉదయతియదిభానుఃపశ్చిమేదిగ్విభాగేవికసతియదిపద్మః
పర్వతానాంశిఖాగ్రే। ప్రచలతియదిమేరుశ్శీతతాంయాతివహ్నిర్నచలతిఖలువాక్యంసజ్జనానాంకదాచిత్॥

టీ॥ భానుః=సూర్యుఁడు, పశ్చిమేదిగ్విభాగే=పడమట దిక్కున, ఉదయతియది=ఉదయించునప్పటికి, పద్మః=పద్మము, పర్వతానాం=పర్వతములయొక్క, శిఖాగ్రే=శిఖరములపై, వికసితియది=వికసించినను, మేరుః=మేరుపర్వతము, ప్రచలతియతి=చలించినను, వహ్ని=అగ్ని, శీతతాం=చల్లదనమును, యాతియది=పొందినను, సజ్జనానాం= సత్పురుషులయొక్క, వాక్యం= వాక్యము, కదాచిత్ = ఎప్పుడును, నచలతిఖలు = చలింపదు.

తా॥ సూర్యుఁడు పశ్చిమదిశయందుదయించినను తామరపువ్వులు పర్వతాగ్రమందుదయించినను, మేరుపర్వతముచలించినను నిప్పు తనగుణమునువిడిచి చల్లదనముపొందినను సజ్జనులు అడినమాటతప్పరు.

శ్లో॥ లోకఃపృచ్ఛతిసద్వార్తాంశరీరేకుశలంతవ ।
కుతఃకుశలమస్మాకమాయుర్యాతిదినేదినే॥

టీ॥ లోకః = లోకము, తవ = నీయొక్క, శరీరే = శరీరమందు, కుశలం = క్షేమము, (అని) సద్వార్తాం = మంచివార్తను, పృచ్ఛతి = అడుగుచున్నది, దినేదినే = ప్రతిదినమందును, ఆయుః = వయస్సు, యాతి = గతించుచున్నది, అస్మాకం = మనకు, కుశలం = క్షేమము, కుతః = ఎట్లు,

తా॥ సాధారణముగా లోకములో నీకు క్షేమమా! అని యడిగెదరు దినదినంబున క్షీణించుచుండెడు ఆయువుగల మనకు కుశలంబెక్కడిదిః నూరేండ్లుపరిమితిగల మనుజునకు నొక్కొక్క దినంబు గతించుచుండు ? ఆయువునశించుచున్నది. కనుక కుశలంబెక్కడిది ?

నీతిశాస్త్రము సమాప్తము.

---



